అభినవసరస్వత్యనుబంధము

శ్రీ సోమేశ్వరాయ నమః.





# రుక్మిణీకల్యాణము

(రాయసము వెంకయ్యగారిచే)

వ్రాయబడె.




చంద్రికాముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపబడియె

మొదటికూర్పు, 300

గుంటూరు.

దీనివెల రు 0-4-0

1911.

# ఉపోద్ఘాతము

ఈగ్రంథము సలక్షణమయి మృదుమధురవచనరచన గలిగియున్నయది- "ముంజేతికంకణమున కద్దమేల"న్నట్లు కవితాశైలి గ్రంథముం గాంచినఁ దేటపడఁగలదు. గ్రంథకర్త యాఱువేలనియోగి- అక్కయామాత్యునికుమారుఁడు- వసిష్ఠగోత్రము. "రసికజనహృదయంగమ సంగీతసాహిత్యకళాధాగంధర్వ" అని గద్యములోఁ జెప్పుకొన్నదానినిబట్టి యీకవి సాహిత్యమునందే కాక సంగీతమునందుఁ గూడ సమర్థుండైనట్టు కనంబడుచున్నాఁడు- శ్రీరంగరాయలయాస్థానమునందుండి యాతనివలన నగ్రహారరత్నాభరణాదులను బొందినవాఁడు- ఈశ్రీరంగరాయలు వసుచరిత్రకృతినందిన తిరుమలదేవరాయల కుమారుఁడు- ఇతఁడు ౧౫౭౪ వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౫ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసినందునఁ గవియును దత్కాలీనుఁడే- ఇట్టి యుద్గ్రంథముచే నభినవసరస్వతినలంకరింపఁజేసినది పల్నాఁడుతాలూకా మోర్జంపాటివిలేజికరణమును రసికులును సుజనులును విద్వత్పక్షపాతులునునైన తెంగెడనరసింహారావుగారు- వీరివంశమునఁ దాతతండ్రులనాఁటినుండియు [illegible] విద్యాప్రియులు- ఈయనతండ్రియగు రామకృష్ణయ్యగారు బహుగ్రంథనిర్మాతలై యిటీవలి పల్నాటి యాంధ్రకవులలో నెన్నఁబడి పండితమాననీయులై పరఁగినవారు- శ్లో॥ సుకవేశ్శబ్దసౌభాగ్యం సత్కవిర్వేత్తినాపరః వంధ్యానహివిజానాతి పరాం దౌహృదసంపదం॥ అనురీతిని దండ్రివలెఁ దామును గవిత్వము చెప్పనేర్చిన శ్రీనరసింహారావుగారు ప్రబంధప్రదానమునఁ బత్రికకుఁ జన్నెఁదెచ్చుటయేకాక సహాయులై సర్వదా కీర్తింపఁబడుచున్నవారు- వీరియింట నింకను నముద్రితములగు ననేకప్రబంధము లున్నయవి- ఇట్టికీర్తికాముల భగవంతుఁడు బహుకాల మాయురారోగ్యైశ్వర్యములొసంగి పరిపాలించుఁగాత- ఈగ్రంథమునకుఁ దప్పొప్పులపట్టీ చేర్చినను మఱికొన్నితప్పులు లేకపోలేదు. పురాతనపుఁ దాళపత్రగ్రంథమయి కొన్నిశిథిలభాగములుండుటయేకాక తప్పులు కుప్పలై యుంటచే నాతెలివికొలఁది నెంత సంస్కారముచేయఁబడినను నచ్చటచ్చట నింకఁ గొన్ని యుండకతప్పినదికాదు- అన్నియును నర్థానుస్వారశకటరేఫాదిలోపములును సవరించుకొనఁ జదువరులే ప్రాజ్ఞులు- వీనికన్నింటికిని గేవలము నాతెలివిలోపమేకాక పత్రికాంతరమున సార్థసంవత్సరపర్యంతము పలుమాఱులు ప్రకటింపఁబడి పలువందినవరణలమీఁదఁ బూర్తియగుటయుఁ గారణంబైయున్నదని మనవిచేసికొనుచున్నవాఁడను.

విద్వద్విధేయుఁడు.

జానపాటి పట్టాభిరామశాస్త్రి,





# లక్ష్మీవిలాసము.

## ప్రథమాశ్వాసము

శా॥ శ్రీలక్ష్మించుదమావిలాస మతిశైత్రిం జిత్తకంజంబునన్
దా లేఖ్యాకృతిఁ గాంచి చొక్కు రుచి బాహ్యంబందునాఁ జేరదన్
లాలిత్యంబులు జూపు సింధుజ నవేలక్రీడలందన్ను నా
లీలాబ్రహ్మము శేషశైలపతి బాలిం బ్రోచు మమ్మెప్పుడున్॥

సీ॥ భాస్వదుత్పలహారత్రపటద్భ్రమరిమతోఁ దృఢతటిద్ఘనదేహదీప్తితోడ
గురుజీవనగ్రహాకుండలరుచులతోఁ బటుసువర్ణవిచిత్రపటముతోడ
విమలముక్తాహారవీక్ష్యమండనముతో శ్రీవరనామసంసిద్ధితోడఁ
దళసహస్రారాబ్జయుతకరక్రీడతో విపులాభరణకళాప్తిస్థితోడ
నాత్మవిలసనపతిరూఢి నలరుచుండు। నిందిరాదేవి హృదయారవిందపీఠిఁ
దిరము గొనఁ జొక్కు వెంకటాద్రీశుఁ డనుదినమ్ము బూర్ణసత్కీర్తి దాయిరు ప్రోచుగాత॥

సీ॥ కమనీయమృదుపదాగ్రములఁ గచ్ఛపలీల మంజుజంఘల సాంద్రమకరభూతి
కరయుగంబున శుభాకారమహాపద్మాప్తివలుఁ జన్నులవరాచలవిభవము
కంఠదేశమున నఖండశంఖసమృద్ధి దంతపంక్తులఁ గుందకాంతిమహిమ
యాననమందుఁ బద్మాహితసంపద యలకాళి నీలైకవిలసనంబు
నాకృతి ముకుందవీక్షణీయాభ మొలయ । నవనిధానప్రధాన సౌందర్యరేఖ
నలరి కలశాబ్ధిఁ బొడమిన కలిమికొమ్మ । స్థిరకృపాదృష్టి మమ్ముఁ రక్షించుఁ గాత॥

చ॥ పరిణయవేళ భార్గ్య తనపాదములీక్షణకై రవంబలన్
నరమతి బూజసేయఁ గరుణన్ సతి కర్ధశరీరమిచ్చి త
ద్గరిమ నుమామహేశులనఁ గా నుతిఁగాంచు పురాణదంపతుల్
సరసత మాకునీవుతఁ బ్రసన్నమతిన్ సకలేప్సితార్థముల్ ॥

ఉ॥ ఆగమముల్ ప్రసిద్ధి కెలయన్ స్వరయుక్తముగాఁ బఠింపుచో
వాగలివేణి తత్స్వరణవర్ణపదక్రమరూఢిఁ జొప్పడన్
బాగుగ నర్తనంబు సలుపన్ సముఖాప్తినహించిమించు మే
ధాగురు నబ్జసంభవు ముదంబునఁ గొల్తు నభీష్టసిద్ధికిన్ ॥

సీ॥ కలితసువర్ణసంగతి యొసంగుటెకాదు కలితసువర్ణసంగతి నొసంగు
సముచితాలంకారసరణి మించుటెకాదు సముచితాలంకారసరణి మించు
శోభితపదరసస్ఫూర్తిఁ గాంచుటెకాదు శోభితపదరసస్ఫూర్తిఁ గాంచు
సత్తాలశబ్ద సంయుక్తిఁ బొల్చుటయకాదు సత్తాలశబ్దసంయుక్తిఁ బొల్చు
లలితసంగీతసాహిత్యకలన నంగ । కళలఁ దగు దివ్యమంజీరములఁ దరించి
మించువాణి మదీయజిహ్వాంచలమున । నించువేడుకలో నటియించు గాత ॥

హరిహరబ్రహ్మలకును లక్ష్మీగౌరీసరస్వతులకును నర్థమిచ్చెడిపద్యము

సీ॥ ధృతికమలామోద వృత్తిఁ దేజమునంటి ఘనసారహేతుభూతి నుతిఁగాంచి
రాజితానంతాభరణ కళాయుతిమించి యక్షరపత్రి హృద్యగతినలరి
ఫలితసత్యాగమాకలితహర్షముఁ జెంది సుమనస్సముదయభావము నెసంగి
బహుముఖాలంకారపదరూఢి విలసిల్లు జడదారికొమరు ముచ్చటలఁ దనరి
ధాత్రిఁ బొగడొందుచును గుణత్రయవిభాగ । మూర్తులై వన్నెకెక్కు త్రిమూర్తులన
మీరు శ్రీపార్వతీ భారతీరమణుల దీనజనసారమణులఁ బ్రోవఁగాంతుమదిని॥

ఉ॥ ఆదరమొప్పనంబ కళలన్నియు బుద్ధులఁ గూర్చి వెన్నతో
బోరిదిగఁ గుక్షి నింపఁ గడుపుంబలవుష్టిని బిక్కటిల్ల లం
బోదరుఁడై శివాభవులకొయ్యన ముద్దులఁ జూపు నుజ్జ్వల
న్మోదకహస్తు హస్తివదనుం గణనాయకు సన్నుతించెదన్ ౮

మ॥ నృపుఁడౌ రాముఁడె దైవమంచు శపథోద్వృత్తిం దదర్థంబు వి
ష్ణుపదం బుద్ధతిముట్టి బాడబగరిష్ఠుం దాటి క్షేమార్తి నా
విపులార్థ ర్త నుదారయుక్తిఁ దనరన్ వేమారుఁ గీర్తించు ధీ
నిపుణున్ భూతనయార్తినిర్వహణు వర్ణింతున్ సమీరాత్మజున్ ౯

—హరిహరహనుమదాదికవిస్తుతి—

సీ॥ వనచరవంశపావనమూర్తియగువాని ముఖ్యాగమోద్ధరణాఖ్యవాని
మహీవరాహస్వామివిహితానుగతివాని ద్రుమలేనిసటలఁ బెంపొలయువాని
మృదుపదక్రమసమర్థితరసోచితివాని బాణప్రభావాప్తిఁ బరగువాని
త్రిగుణాత్మకప్రౌఢి తేజమందినవాని హంసరుద్యతసూక్తి నమరువానిఁ
గలితసుప్రతభారవిఖ్యాతివాని- గరిహననధన్యకీర్తినాకలనవొప్పు
వాని వినుతింపుచు నొనర్తునంపనములు వరుసపండప్రణామపూర్వకముగాఁ x ౧౦

క॥ శుంభచ్చతురాననసుత గుంభితరసవాగ్విలాసగురువిభవములోఁ
బుంభావసరస్వతులన గంభీరతఁ దనరు నాంధ్రకవులను నుతింతున్ ౧౧

వ॥ అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవికీర్తనంబునుం గావించి యమందా
నందలోలలోకబంధుసందర్శనానంద దరదరవింపస్పందిమకరందరస బంధురంబగు
సౌకృమహాప్రబంధంబు రచియింపఁ బూని సకలేష్టదాయకుండగు కృతిపతి నన్వేషించు
నెడ ౧౨

శా॥ శ్రీమద్దివ్యభవభావ్యపంకజభవశ్రీకంధరేంద్రామరుల్
రోమాంచాన్వితగాత్రులై యెదుట బారుల్ దీర్చి సేవింపఁ ద
త్క్షేమానుగ్రహయుక్తి లెమ్మనుగతిన్ శ్రీహస్తముల్ జూపు శ్రీ
భామాసక్తుఁడు వెంకటేశ్వరుఁడు స్వప్నప్రాప్తుఁడై యిట్లనున్ ౧౩

క॥ వరమతినుపయించితి మద్వారమున నటుగాన నీవు వర్ణించు మ్మతీ
శ్వరుఁడనయి వరములొసఁగెద గరిమన్ లక్ష్మీవిలాసకథఁ జెప్పఁదగున్ ౧౪

తే॥ అని దయారసదృష్టితో నభయ మొసఁగి కృతి యొనర్పుము నాకు నంకితముగాఁగ
వత్సదీర్ఘాయురస్తు భవ్యగతి నీవు ననుచు దీవించె నంత నే నద్భుతముగ. ౧౫

కం॥ మేలుకొని స్వప్నలబ్ధపు మేలు సుధీజనులతో నమృతసారరుచుల్
జాలుకొనఁ దెల్ప నెన్నఁగఁ జాలు కృతార్థుఁడ ననుచు సంభ్రమపరులై ౧౬

మ॥ చతురోక్తిన్ ననుజూచి యిట్లనిరి వత్సా నీవు గావించు స
త్కృతి శ్రీవెంకటభర్తకేఁ గనుట యొంతే పూర్వజన్మాంతరా
ర్జితపుణ్యంబునఁ గాక కల్గునె యశశ్శ్రీ కైహికాముష్మిక
స్థితి కర్తం గృతిభర్తఁ జేసి కను సుక్షేమాయురారోగ్యముల్ ౧౭

కం॥ సకలాధిపత్యనిర్వాహకుఁడని జనులెన్న వెలసితౌ ధరఁ గర్ణా
టకరాజసభల నిష్కంటకముగ రాయసము వెంకటపతీ సుకృతీ ౧౮

మ॥ అలఘుప్రాభవగర్వభాక్కుతుపశాహామేయసైన్యంబు న
గ్గలికంబంపుల చేతఁ గెల్చి బిరుదుల్ గైకొన్న శ్రీరంగరా
యలచిత్తంబిగురింప రాయసముద్రాయుం జాలితౌనా సుధీ
తిలకుండక్కయమంత్రి వెంకటపతీ దీవ్యత్కళావాక్పతీ ౧౯

కం॥ ప్రతిపద్యశిరఃకంపము ప్రతిపదచిత్రార్థగోచరము ప్రతివాక్య
స్థితి రసబంధురమైయు న్నతిఁ గాంచఁ బ్రబంధ మీ వొనర్పుము హారికిన్ ౨౦

వ॥ అని మదీయాభిప్రాయానుగుణ్యంబుగాఁ బెద్దయుంబ్రీతిఁ బెద్దలు నిర్దేశించి
న నానందరసతరంగంబుల నోలలాడుచు మత్కులదైవంబగు నద్దేవు నుద్దేశించి నమస్కరించి
భక్తియుక్తంబుగ నేతత్ప్రబంధప్రారంభసంరంభధురంధరుండనై తనరు నస్మదీయవ
ర్తనం బెట్టిదనిన

శా॥ శ్రీలక్ష్మించు సమగ్రధీకళలచేఁ జెన్నొందు నార్వేలవం
శాలంకారకరుల్ వసిష్ఠముని గోత్రాంకుల్ బుధుల్ దీనర
క్షాలీలన్ బొగడొంది రందు వెలసెన్ సన్మాని భావప్పది
జ్ఞాలోద్వేలవిశాలకీర్తుల సుధీసందోహమందారుఁడై ౨౧

చం॥ అతనికి నుద్భవించె నుగుణాంబుధి తిమ్మయమంత్రిపుంగవుం
డతఁ డతివైభవున్ నరసయప్రభుఁ గాంచె నతం డుదారతా

యతగతి విఠ్ఠలార్యుఁగనె నాఘనుఁడప్పయమంత్రి శేఖరుల్
సుతునిఁగఁగాంచె నావరయశోనిధికిల్ మహినేనుగల్గితిన్ ॥ ౧౩

కం॥ మరిశ్రీనివాసమంత్రియు సిరులన్ రామప్రధాని శేఖరు లుదయిం
చిరి వారికగ్రజుఁడనై ధరఁదనరుచు నత్యుదాగతాధిపగరిమన్ ॥ ౧౪

ఉ॥ వారియుదురాజ్యవైభవధురంధరభూతివలిర్పఁ గీర్తిధా
రేయు సిరంగరాయమహిభృన్మణిరాయస మగ్రహారహే
మాయతరత్నభూషలు నృపార్ఘ్యులువర్తనలీయనుబ్బుచున్
వేయననేమి రాయసము వెంకటమంత్రియనా యశస్వినై ॥ ౧౫

కం॥ సుశీలనెసఁగి విభవా । వాలంబగు వెంకటాద్రివల్లభుకరుణన్
శ్రీలంజెల్వొందుచుధర । నాలక్ష్మీశ్వరమణుగుణములభివర్ణింతున్ ॥ ౧౬

శ్లో క ము.

శా॥ చంగత్తుంగపతర్ఝరీతటనటచ్చక్రాగరంగద్గిరు
ద్గాంగేయద్యుతిపుంజరంజితదరీధాతుప్రభామేదితే
శృంగే పన్నగరాణ్ణగస్య రమయాక్రీడంతముద్వాంఛయా
శృంగారాంగదసంగతాంగమనిశం శ్రీవెంకటేశంభజే॥ ౧౭

సీ॥ వికచపంకజగళన్మకరందలీలఁ బూర్ణకటాక్షములఁ గృపారసముఁ జెంద
మృదులప్రవాళబింబితసమద్యుతివోలి యధరంబుపై మందహాసమమర నొ
ప్పానయనిర్యత్సంగతేందుబింబవిభూతినుభగవక్షమునఁ గౌస్తుభమెసంగఁ
దలకోకనదసమాకృతరథాంగద్యుతిఁ జరణాస్తరత్నహంసమ్ములాలయ
సగసంజాతసురనదీర్ఝరివికాస । పూరితాంగుష్టనఖకాంతిధారనిగుడ
శ్రీసమాహితమూర్తియై సిరులఁదనరు । వాని శ్రీవెంకటాచలస్వామిఁ దలతు॥ ౧౮

మ॥ తను సేవించుజనాళికిం గరుణనిర్ధాత్రిన్ మనోవాంఛలె
ల్లనుబూరింతునటంచు లోకులకు నెల్లం దెల్పఁ బ్రత్యక్షమై
జనసంఘంబులనిందురమ్మనుచునోజంబిల్చున ట్లాశ్రితా
వనహస్తాబ్జముఁజూపు వెంకటనగస్వామిం బ్రశంసించెదన్॥ ౧౯

మ॥ పగలున్ రేలొనరించుగొందలకుసుల్ భావింపుచున్ సుప్రస
న్నగతిన్ భక్తమనోమహోత్పలము లానందింపఁ జంచత్కృపన్
బగలున్ రేలన కీర్తిఁదాలు లొనగూర్పంజాలు నాశంఖచ

గ్రగదానందక శార్ఙ్గహస్తు ఘనతరాగ్రగస్తుఁ గీర్తించెదన్ ॥ ౩౦

షష్ఠ్యంతములు.

కం॥ ఈదృగ్గుణమణిహారున । కాద్యతలక్ష్మీమనోవిహారున కజరా
మోదననరఖాదనపర । భేదనకరసారుచకుఁ । గుభృద్ధారునకున్ ॥ ౩౧

కం॥ కరకలితవలయహేతికిఁ । గరుణారసపూరితపురవిమూతికి దివ్య
చ్ఛరణానతశరణాగత । భరణాతతకృతికి మోక్షఫలదాకృతికిన్ ॥ ౩౨

కం॥ పత్రరథపత్రికుఁదా । పత్రియదాత్మనకు ఖండపరశుకళత్ర
స్తోత్రగుణపాత్రపరమప । విత్రచరిత్రునకు సవిత్రవిధునేత్రునకున్ ॥ ౩౩

కం॥ సహనజహన్గహనవహా । ద్గహనమహత్వవ్యాప్తిఘృతికిఁ దాపసజనహృ
ద్గహరవిహారత్స్వతేజో । గ్రహపతికిం ద్రుహిణముఖ నరప్రపమతికిన్ ॥ ౩౪

కం॥ శ్రీవనితాజీవనతా । భావనతారుణ్యమతికిఁ బదధాటీసం
జీవితదృషదాకృతికిన్ । శ్రీవెంకటపతికి ఫలితసేవాకృతికిన్ ॥ ౩౫

వ॥ అంకితంబుగాఁ బొంకింపంబూనిన రమావిలాసంబను రసవత్ప్రబంధం బెట్టిదనిన॥ ౩౬

కం॥ శ్రీరమణీశకథామృత । సారమునం దనివిచనక జనమేజయుఁ డి
చ్ఛారతి వైశంపాయన । సారయతిన్ జూచిపలికె సవినయమతియై॥ ౩౭

సీ॥ అనఘభారతమునం । దాదిపర్వంబున దివిజులంబోధి మథించుటయును
సరసిజాలయ యందుజనియించుటయును బెంపలరంగ నేను వినవలననింటి
మునుపదిసంకోచముగఁ బల్కితివిమీరు గావున నీకథాక్రమము వినఁగ
వేడుకయ్యెడు నాకు విబుధులేరీతి మందరమునునంబుధిఁ ద్రచ్చి రందు
శ్రీమధురవాణిజనన మేరీతినడచె । నవ్వుమహారియెట్లుపరిణయంబయ్యెనదియు
నానతీవలె నన్నహర్షాదరమతి । జనపతికిఁ దెల్పఁదొడఁగెఁ దామునివరుండు॥ ౩౮

కం॥ అమరవరులందరును దమ । కమరత్వము బలసమృద్ధి యారోగ్యశ్రీ
లమరఁగ యోజన లధికని । యమరతిఁగొని యమృతలబ్ధియగునిదియనుచున్ ॥ ౩౯

చం॥ కులగురుఁడౌ పితామహునకుం దెలుపందగునిట్టికార్య మ
య్యలఘుఁడు నిర్వహింపగలఁడంచుఁ బురాంకపురస్కృతంబుగాఁ
బలుకులకొమ్మ నేలుదొర పాలికి వేచని భక్తియుక్తులై
పలగొనివందనంబు లిడి వాంఛితముల్ దెలుపన్ విరించియున్ ॥ ౪౦

కం॥ సనకాదివంద్యుఁడగునా । కనకాచలధృతికి హరికిఁ గాకగునే యీ
ఘనకార్యనిర్వహణమని । జనకామదుఁ జక్రిఁ గాంచి సంభ్రమపరుఁడై ౪౧

కం॥ తామరసభవుఁడు భవము । ఖ్యామరసభగోల్వఁ జెల్వమరుహంసగరు
చ్చామరసమితిదనర హరి । సామస్సన్నుతించి త్తనలినుండగుచున్॥ ౪౨

శా॥ వేవేగం జనుదెంచి చిత్రమహిమావిఖ్యాతసత్కీర్తి ము
క్తావిభ్రాజిదిశానిశాకరముఖీకంఠోపకంఠంబునా
శ్రీవైకుంఠపురంబుఁ జేరి దనుజారిన్ శౌరిసేవించి యా
దేవానీకము రాక వీక మితనూక్తిన్ భక్తితోఁ దెల్పినన్॥ ౪౩

కం॥ పవిధారిముఖామరులుంచి । తవిధానం బెసఁగఁ జక్రధరుఁ బొడగని యా
రవిధాము వినుతిఁ జేసిరి । వివిధాగమసూక్తములను వినయాన్వితులై ౪౪

సీ॥ దండంబు శార్ఙ్గకోదండపాణికి నమస్కారరీజావళితవిహారునకును
వందనం బాశ్రితనందనంబునకు జోహారు వేదాంతవిహారునకు
సాష్టాంగమానందతుష్టాంగునకుఁ సుప్రణామంబు తతకరుణామయునకు
వినతి పాతకమీనఘనతిమింగిలునకుఁ గేలుమోడ్పు విచిత్రఖేలునకును
దేవ ప్రాంజలి నీకు భూదేవవినుత । సవనభోక్త లమము సారసవనసీమ
కరుణారుచివోలె రక్షింపు కరుణఁ బెంపు । జీవనదనీలగాత్ర రాజీవనేత్ర॥ ౪౫

గుచ్ఛబంధము.

కం॥ వరదరకరమురహరకరి హరిహరనుతనతవితరణ యాగమగణ్యా
శరధరనరవిలసనసర సరతనలినవనవిహార సౌకశరణ్యా ౪౬

గోమూత్రికాబంధము.

కం॥ సుమశరమూర్తిదయాపర కమలేశకమనవినోద ఘనరాజదరీ
హిమకరకీర్తిజయాకర విమతాశరమదవిభేద వినతాజహరీ ౪౭

చక్రవాళబంధము.

కం॥ చరణానతజనభరణా భరణాసహశత్రువిజయ భద్రాంకిరణా
కిరణాయితరవిశరణా శరణాగతరక్షణైక సంఘాచరణా ౪౮

కం॥ వృత్రాశరజిత్ప్రముఖులు సత్రాశనులనఁగ వినఁగ జాలక శుభచా

రిత్రా శరణనియొదము ప విత్రాశన మమృత మొసఁగవే జగదీశా ౪౯

వ॥ అని

కం॥ తాననివిశేషభక్త్య త్తాననియతిమైన దితినితంబవతీ సం
తాననిచయమునుతించగ తాననిలాభర్త యేకతానప్రీతిన్ ౫౧

కం॥ వారలఁగనుగొనిద్రాక్షా వారలఘురసాతివేలవాఙ్మయపారా
వారాలహరుబంగృప ద్రి వార లలిందేల్చి జగదవనుఁడిట్లనియెన్ ౫౨

తే॥ ధృతినిగావింపఁగలరేని హితముఁబూని వినుఁడువినుపింతునొకమాట మనసునాట
వరగుణంబులఁబొగడొందువార్ధియందు సకలవస్తుప్రపంచంబుసమధికంబు ౫౩

కం॥ భావంబలరగదివ్య గ్రావంబగునట్టిమందరము కవ్వముగాఁ
గావించియబ్ధిఁదరువన్ జీవనముగ నమృతమచటఁజేకురుమీకున్ ౫౪

వ॥ పొడముఁ మెడియుదివ్యవస్తునిచయంబున్ వాంఛలీడేరఁగాఁ
గడలిం గావునఁ దత్ప్రయత్నము ధృతింగై కొండుమీరంచు నే
ర్పడవిష్ణుండు హితోపదేశమొనరింపన్ వల్లెయంచున్ ముదం
బడరంబొంగి సురాసురాధిపులు తత్ప్రారంభమందుండఁగన్ ౫౫

కం॥ శంకరిదేవుఁడుజూచివ శంకరగతినిట్టులనియెఁజక్రికిని భవ
త్కింకరవరులగువీరలు కింకరసాధింతు రెట్టికృత్యమునుహరీ ౫౬

సీ॥ ధీరులై శరధిగంభీరులై ప్రబలదోస్సారులై యాశాధికారులుండ
మేటులై బలుధైర్యపేటులై పటుజైత్రధాటులై దైతేయకోటులుండ
గణ్యులై త్రిజగచ్ఛరణ్యులై విపులకారుణ్యులై సుమనోవరేణ్యులుండ
దక్షులై సురకశాధ్యక్షులై రుచిజగచ్ఛక్షులై గంధర్వయక్షులుండ
నోరమాజాని వైషమ్యయుక్తిమాని వీరుభవదాజ్ఞనూని కావింపలేని
పనులుగలవయ్య యెందేనియనుభవాని విభునిపలుకులుచెవియాని వేడ్కబూని

కం॥ కావింపుడీప్రయత్నము రావింపుడుసకలజనులఁ బ్రార్థనతోడన్
సేవింపుడు గణపతి సం భావింపుడుపూజఁజేసి మందనగమున్

కం॥ అనివారణవదుఁడుదా, ననివారణగరిమఁబలికి యదనన్యమెయుం

గని వారిదృఢప్రయత్నముఁ । గని వారకమరియుఁననియెఁ గౌతుకమెసఁగన్ ౫౯

సీ॥ తర్కింప నొకశక్తిధరునిచే దళితగర్భంబగు క్రౌంచపర్వతముగాదు
గనుఁగొన నొకతపోధనునిచే నౌన్నత్యమడుగంటఁబడిన వింధ్యాద్రిగాదు
పరికింప నొకమహాబలునిచేమహిమగోల్పడినట్టి మేరుశైలంబుగాదు
వివరింప నొకదైత్యవీరుచేతను బెల్లగిలినట్టి రాజతాచలముగాదు
వేయిశక్తిధరుల్ పదివేలతపోధ । నులును గోటిమహాబలుల్ నూరుకోట్లు
దైత్యవీరులుగూడిన-దాకితరల । నట్టిధృతిశాలి మందరాహార్యశాలి ౬౦

వ॥ కావున ౬౧

కం॥ పౌరం ॱ పురవాసులు । మీరంపరుఁగూడిచనుడు మేకొన్నధృతిన్
దేరంపరమగునగ్గిరిఁ । జేరం దరళత్వముడిగి చెలగుచుననినన్ ౬౨

ఉ॥ అర్థిననుగ్రహించి యమృతాశన్బులు కెల్ల నేటితో
సార్థము సేయఁబూనితి దయాపరమూర్తివి వాసుదేవ యీ
యర్థమువీకటాక్షముననయ్యెడిమాకని యుక్తిదేవతా
పార్థనఁజేసి యప్పుడుసుపర్వులు తచ్ఛుభకార్యధుర్యులై ౬౩

సీ॥ సంగీతమేళ మెసంగనాకస్వామి వేదఘోషంబుల వెలయఁగీలి
ధర్మవిధిజ్ఞ నాదములతో సమవర్తి బలసింహనాదార్భటులఁ బలాసి
వాహినీశస్తోత్రవైఖరి వరుణుండు ఘనవేణురవముల గంధవహుఁడు
కిన్నరకంఠహేంకృతిమించి ధనదుండు భేరుఘక్కలు మ్రోయఁ బురహరుండు
పృథులగతిమించి తమపేరులేర్పరించి । చేరిపాడగాంచి వేర్వేర చేమొగించి
నతునవహ్నించి తానుననడువ మంచి । యంచ తేజీదువాళించి యలవిరించి ౬౪

వ॥ తదవసరంబున ౬౫

ఆ॥ అసురప్రకాండ మానురప్రభుమండ । లములఁ దొప్పగంచలములఁ కాంచి
వారిజాతనూతి వారి జాతప్రీతి । వలెనుబల్కెఁ శూలివలనుమీరి ౬౬

సీ॥ కేదారసంవాసిభూదారవాహంబు లీదారి కైదారికేచ్ఛఁదిరుగుఁ
గౌమారవనవారుభీమారవములచే నీమేడపేమారు నెలమిమెలఁగు
నా దండకారణ్యవేదండములువచ్చి యీదండ నుద్దండహేలనల్లు
ద్వీపాయతనకల్పితాపాయవిహగంబు లీపాయ నోపాయవృత్తినుండు

నిది సురలవాడ నిది నిర్జరేంద్రమేడ । యిది హరవిలాస మిది సిద్ధబృందవాస
మిది ఘనదుధామ మిది మహాహార్యసీమ । యిది మణులకోన యిదె మందరాద్రికాన

సీ॥ సముదాత్తరుచిరవార సుమమాంబురుహసౌరభ ముదావహ సమీరగమనచార
మనుసార సాహాస ఘనసారతరుమార ఘనసాదనభేద పటువినోద
మసమానమణికచ్ఛగ సమానతానంద నసమానసుందలాభవ్యసంప
మఖరాంశుగురుశుక్రముఖ రాజితానక్రశిఖరాయతానక్రసుఖిసచక్ర
మమితపాటీరవాటీయుతాభిశోభి । కటకపాళిప్రతోళివిసస్వరస్వ
రకృతనానావధానామరావతీన । రాళిచిపురాళి యీమందయాద్రిమాళి ౬౮

కం॥ వరసర్వమంగళశార । గరిమంబు నహీనరత్నకటుస్ఫుటవై
ఖరిఁ గాంచునీగిరీశ । స్థిరతరమహిమంబు వినుతిసేయు దరమే ౬౯

సీ॥ శశికాంతతటకాంతిఝరకాంతమొకచెంత నుద్దామసుధామ మొక్కసీమ
గగనాటమునికూటఘనవాటమొకచోట నుద్రిక్తశిఖిరావ మొక్కత్రోవ
వరశారదపటీరతరువాటి మొకమేర నురుసారవమదాంక మొక్కవంక
వరయానసన్మానసటగాన మొకకోన నుద్వేలమణిజాల మొక్కమూల
దనరనొకరారిచారుమందారసార । మధురిమధురీణసలరసామ్రానమాన
సకలసకలాలవనకీరశారివారి । యగుచుఁ దగుఁ జూడ నగు శైలమతులగతుల ౭౦

కం॥ మునుకొనువని కనుగొనుమని । యనుఁగున మునిముఖ్యుఁడంబుజాసను డిట్లన్
వినుడీయని వినుపించుచుఁ । బనిఁబంచుచు రా సుపర్వభాగ్యవశిష్ఠున్ ౭౧

కం॥ వింసుగవిని పొలసుగఁగని । రందరు ననివారణప్రయాణోద్వృత్తిచే
ముందరఁ దతకందరము ప్ర । రందరమణికోటుల సుందరను దుముక్ ౭౨

వ॥ ఇవ్విధంబున

మ॥ కని చేరంజని నేత్రరంజనగతిన్ గన్పట్టునామేటిగ
ట్టునకుంబూజలొనర్చి పేర్చి మహిమాఘున్ దిత్యదిత్యాత్మజున్
ఘనదోశ్శక్తిఁ బెకల్చియెత్తి మహిలోకంబెల్లభీతిల్ల ఘూ
ర్ణనమగ్నాచ్ఛటుబుప్పతిల్ల జగముల్ ఘూర్ణిల్లఁ బెల్లుబ్బునన్ ౭౪

తే॥ వడిశిపఢమంపనద్రి యాకరణి వెడలి । ధరణిబిలమునఁ బాతాళసరణిఁదోచెఁ
బురుడులేనట్టిఫణిసరుల్ పారుఁడు దాఁప । బిగుడబుచ్చినసామ్ముల భరణిబోలె ౭౫

కం॥ వెల్లదనము చల్లదనము । తెల్లమిగాఁదోఁచె సురపతిప్రముఖదిశా
పల్లవతల్లజముఖపద । పల్లవములనుల్లములవిపల్లవమెసఁగన్ ౮౬

శా॥ ఏలామాధవికాలతాగృహములన్ । హేలావతీలోలుఁడై
యేలల్ పాడుచుసౌఖ్యవ్యాప్తిమనలేకీలేపనిన్ మాకుఁగా
నేలా చేసెవిధాతయొవ్వారిశరంబీపత్తోద్ధారణం
బేలాగొవ్వరుదిక్కటంచు సురలాత్మేశున్ హరిన్ వేడినన్ ౮౭

మ॥ కరుణాసింధుఁడు భక్తవత్సలుఁడు శ్రీకాంతుండు నానాజగ
ద్గురుఁడాదీనుల నెల్లఁ బ్రోవఁ గుహనాకూర్మాకృతిం బూని భూ
ధరమున్ వెన్ను ననుబ్బనెత్తె లయపాథస్స్వామినిర్మగ్న దు
ర్భరలోకోద్ధరణక్రియాపటిమఁ దెల్పం జాటులీలాగతిన్ ౮౮

మ॥ కలయందున్నెదమూలముట్టఁగ భవద్గాంభీర్యమన్నట్టన
ర్గళశక్తిం దిగుమందరంబుఁగని క్షీరత్వంబునన్ వేగఁదా
బలము వ్వెత్తుగమీఁటె దేననుగతిం బై కుబ్బనెత్తెం గరా
మలకప్రాయముగా సుధాజలధికూర్మస్వామి చేదోడుగన్ ౮౯

కం॥ ఆళీకరతలతాడిత । కేళీకందుకములీల గిరి యెగబికి విభ్ర
న్నాళీకకమఠకర్మఠ । నాళీకదళాక్షువీపునన్ నటియించెన్ ౯౦

మ॥ జనుతెల్లన్ బహుకాలభూధరణదీక్షాప్లుష్టసంనక్తవ
ద్ఘనపృత్సన్నమలినంబు మందరమహాగ్రావాగ్రసంఘర్షణం
బున నబ్ధిన్ విదళించుకోఁదలచినా మోదంబుచే విశ్వరం
జనుఁడై యాదిమకూర్మశేఖరుఁడు తచ్ఛైలంబు వెన్నానినన్ ౯౧

సీ॥ నిలువెల్లగన్నులై తిలకించెసురరాజు మిగులఁదేజస్వియై మెరసె వహ్ని
చెలఁగెనుద్దండుఁడై జలజాప్తసూనుండు నైరృతి తమి మహానందమొందెఁ
బెంపొందెజీవనసంపత్తి వరుణుండు పవనుఁడామోదసంభవముగాంచె
నలరెఁ బెన్నిధిఁగన్నపోలుపు గాధనదుండు గంకులు వైచె నంగజవిరోధి
ముదముసంధిల్లెసర్వతోముఖవిలాస । మమరఁబరమేష్ఠి మిన్నందె నమరసమితి
కూర్మమనుకంపభక్తులకోడు వలఁడఁపి । నల్లమిగురించి మందరంబుద్ధరింప ౯౨

కం॥ తదవసరంబునఁ బ్రమదం । బొదువఁగ నిట్లనియెనజుఁడహో సురలారా
కొదువలుగలుగునెశ్రీహరి । పదవనజాతార్చనానుభావుల కెందున్ ౯౩

కం॥ కావున నుల్లంబున సా । దేవునకు నమస్కరించి ధృతి నీనీల
గ్రీవుననుమతిని నీఁకనొక । తావునకుంజనవలయుహలు టాహుటినడలన్ ౯౪

సీ॥ పుడమివ్రాల్గంటిని నిడువాలుపడఁగఁగుంపునను గెత్తుఁగ మోయుమోపరీఁడు
పంచుగుబ్బలిపట్టిమదినాటుమేటికి ముంజేతికడ్డైన ముద్దులాఁడు
పసిఁడిచాయలశాటిపొసఁగఁదాల్చినమేటిదొరకు మేల్వరుపైనదుండఁగీఁడు
అన్నివిద్యలకుఁదానాఁటపట్టని జనుల్ సన్నుతింపఁగఁగీర్తిఁగన్నవాఁడు
బడుగుచలిగాలిమేతలపండెకాఁడు । పటలముగువేయుమోములపాపఱేఁడు
గట్టిగాదీనితరిత్రాడుకాఁగలాఁడు । పోయితె “ మ్మన్న నుబ్బి యా దాయవీఁడు 95

కం॥ స్వామీ!యేమీ మీదగు । శ్రీమీఱినపలుకు లిపుడెచేసెద మోవా
క్ష్మామీ! మామీఁదిదయం । జామీకరగర్భ! సెలవొసంగుము వేడ్క౯ 96

వ॥ అనియిట్లు 97

ఉ॥ ఆనతపారిజాతమగు నయ్యజుశాసనము౯ గొభృత్సుతా
జానియనుజ్ఞయుం బడసి సత్వరతంజని దానవేంద్రవై
మానికసంఘముల్ గనె నమందగతి౯ బలిరాజశేఖర
స్థానమహాజనోన్నమితదానపతాకము నాగలోకము౯ 98

సీ॥ కీరముల్ శ్రుత్యర్థసారముల్ సత్కళాపారముల్ రహిఁగనభ్యసన మొసఁగ
శారికల్ వేదాంతకారికల్ మదిలోనికోరికల్ మీఱ వ్రాక్కుచ్చి చదువఁ
బైకముల్ సామానువాకముల్ స్వరమాత్రపాకముల్ దప్పక పఠనఁజేయ
హంసముల్ కలుషవిధ్వంసముల్ మునికులోత్తంసముల్ గఱపుతత్త్వములఁజొక్కఁ
బరఁగు మేడలు వాడలు ఫలరసాలు । పసులకేలఁకులకొలఁకులు వన్నెమీఱ
నెడలఁదిలకించి పులకించి నడచిగడచి । ప్రకటరయధాటి బలినగరంబుదాఁటి 99

చం॥ ఫణిపఫణామణీగణప్రభావిభవాభినవస్ఫురన్నభో
మణిఘృణిపూరపూరితసమస్తదిగంతము భోగికన్యకా
మణిచరణాంబురుట్కటకమంజుఝణంఝణనాదకాంతము౯
బ్రణతజపచ్ఛవంత మహిపాలనిశాంతముఁ గాంచియచ్చట౯ 100

సీ॥ వసుమతీసతికి నెవ్వనిఫణాపంక్తులు మణిమయకేళికామంటపములు
వాణీవధూటి కెవ్వనిసహస్రాస్యముల్ కమనీయనృత్యరంగస్థలములు

వైకుంఠపతికి సెజ్జయౌనిదివ్యభోగంబు లాభోగమృదులశయ్యాతలంబు
వాసుదేవునికి నెవ్వరినిజాకారంబు కరకాండమండన కంకణములు
చర్చసేయంగ నట్టికశ్యపునిపట్టి । భూభరణకర్తన్ నాదిమభోగిభర్తన్
నర్థిఁదాఁజేరనరిగి సాష్టాంగమెఱఁగి । వినుతిఁజేసెను ఘనత నవ్విబుధజనత 101

మ॥ “ మురవిద్వేషికిఁ గేళికాశయనమై ముక్తాతపత్రంబునై
సరసామోదవినోదనవ్యజనమై సంజ్ఞాపనావేత్రమై
చరణాంభోరుహపాదుకాయుగళివై సౌలభ్యదివ్యాస్త్రమై
పరమామోదముగూర్తువీవు శ్రీధరున్ ఫణిగ్రామణీ! 102

ఉ॥ కొండికనాఁడె పాదములఁగూర్చి కటిన్ సవరించి యంతదో
ర్దండముఁజేర్చి కంఠమునరంజిలఁజేయుచు నిన్ను మే ముకో
దండుఁడు కర్ణపాళికలఁ దాల్పఁగ సద్గుణశాలివై మహా
కుండలివైతి గాదె నయకోవిదులెన్నఁగఁ బన్నగేశ్వరా! 103

సీ॥ అండజాతస్వామివై ప్రసిద్ధికినెక్కి గోత్రోద్ధరణలీలఁ గుమురుపఱచి
పరివసౌకర్యాంగ విఖ్యాతిగైకొని హరిముఖస్తవనీయ గరిమనమరి
వరకళాగౌరవ వాక్ప్రియంబొనరించి పరశుధవ్యాపారపటిమమించి
ఘనరసాతలనాయకత్వంబుప్రకటించి రామావతారవిభ్రమముగాంచి
మారుతాశనమున చింతమహిమనొసఁగి । కలుషఖండనపాండిత్యములపరించి
యున్న నాదిమచక్రివైయున్న నిన్ను । సన్నుతింపంగవశమె సాక్షాదనంత! 104

అర్థత్రయము.

చ॥ పరహృదయాభిరామఘనపద్ధతియున్ శ్రుతిరహస్యభూతిభా
స్వరకరకంపితస్ఫురణజాకరణంబు బదక్రమాత్త సు
స్వరకటకప్రభావమును వర్ణనకెక్కఁగమించు శంకరా
భరణము! నిన్నుతించెదము భావములం దనురాగభావనన్ ”॥ 105

గీ॥ అనుచు నెలకొన్నభక్తి నత్యలఘుసూక్తిఁ । దనను హర్షంబున నిలింపతతినుతింప
నాత్మనంగీకరించికార్యంబుఁగాంచి। మనవితెలఁగొల్లవినుచుఁదా “మంచి”దనుచు 106

మ॥ రణకేళీనిపుణుఁడు శంభుఁడిటులన్ బ్రార్థించి భూభృద్ధను
ర్గుణరూపంబమరన్ బురత్రయజయారూఢోత్సవంబబ్బిన
ట్లణుకాలంబుననిత్తు నీప్సితము మీకంచున్ వడిన్ వచ్చె నా
ఫణిభూభర్త ఫణాసహస్రమణిదీపశ్రేణిరాణింపఁగన్॥ 107

కం॥ ఈచందనమునఁబయోధికి। శ్రీచందనపవనభక్తశ్రితమందారుం
డై చందమామజిగి తుల। దూచన్ దన మేనికళలతో జనుదేరన్॥ 108

కం॥ వనమాలి యచటి కఖిలభు। వనమాలికయభినుతింపవచ్చె నితరభా
వనమాలి యాత్మపదసే॥ వనమాలిన్యమగుసాధువర్గముగొలువన్॥ 109

వ॥ ఇట్లుఁబఱతెంచి తత్ప్రార్థనన్ గాంచి పురికొల్పిన 110

ఉ॥ పట్టుదుమారుత్రాడనుచుఁ బన్నగరాజునుమందరాద్రికిన్
దట్టపువేడ్కతోడఁ దరిత్రాడుగఁజుట్టితదగ్రభాగమున్
బట్టిరిరాక్షసేంద్రులుసుపర్వులుసందియమున్ గ్రహింపఁగా
దొట్టినయీసునన్ దొలగద్రొబ్బుచునుబ్బులఁగుబ్బతిల్లగన్॥ 111

వ॥ అంత. 112

ఉ॥ మానధనాధికుల్ దితికుమారులు శూరులు పూర్వదేవతుల్
గానగ్రహించి రయ్యహిశిఖామణియగ్రిమభాగమంచు నీ
శానుడు పెద్దపిన్నవరుసల్ దెలుపన్ బ్రతికించినారటం
చానినవేడ్క బట్టిరిసురాధిపులత్తరిఁ బుచ్ఛభాగమున్॥ 113

మ॥ భుజగర్వంబున నాశరుల్ సురలు నంభోరాశిఁద్రచ్చన్ మహా
భుజగగ్రామణిమస్తపుచ్ఛములనార్పుల్మీరనందించునా
గుజగుంపుల్గనవయ్యో నీసెలవుమాకున్ జూపుమంచున్ దమో
రజముల్ సత్వగుణంబుఁబట్టి చలపోరన్ జూచుచందంబునన్॥ 114

సీ॥ అమరకాంతావరోహారోహణార్థ నిర్మితవజ్రపట్టికాశ్రేణియనఁగ
బవమానవశపరిభ్రమమాణపరివృతపటుసింధువీచికాపంక్తియనఁగ
గటితటాభోగసంగతిభూరిముక్తాభిరామకాంచీదామరాజియనఁగ

జటులాభ్రమాదీర్ణశంకానిబద్ధదివ్యారోప్యమయవలయాళియనఁగ
నెసఁగమోదంబుదట్టి యాకసముపట్టి। వరుసఁగొనిచాలుగట్టి మందరముఁజుట్టి
గొనబుతరిత్రాడునెటిజుట్టుకొన్నయట్టి। చిలువజగజెట్టి కద్రువకళికిపట్టి॥ 115

మ॥ కమలాధీశుననుజ్ఞఁగాంచిరధినీకాంతుండు బ్రహ్మాండభాం
డమునెల్లన్ సృజియించుపెత్తనముపూనన్ సమ్మణీవేత్రసం
భ్రమితంబైనకులాలచక్రముక్రియన్ రాజిల్లె దేవాసురో
త్తమయత్నోచ్చలితభ్రమద్గతుల మంధానాద్రి యంభోనిధిన్ 116

గీ॥ కోరికలుబేర్చు దాయాదికులమొనర్చు। నబ్ధిమథనంబుఫణికి నయ్యద్రిమణికి
దరువతరువంగమరిమరిదాపుగల్గెఁ। దిరుగతిరుగంగఁగడుతరితీపుగల్గె 117

మ॥ కులరత్నంబగుమందరాచలముగన్గొంగనుత్సాహియై
వలయగ్రావము పెక్కురూపముల లేపం దోఁచుచందంబునన్
జలమున్ బూని సురాసురాధిపులుద్రచ్చన్ సింధుజాతోర్మికల్
నలమానాకృతి నంతరాంతరములై వర్తిల్లె మిన్నందుచున్॥ 118

వ॥ ఇట్లానితేయదైతేయసముదాయంబు లమేయదోర్బలసహాయులై మహా
యత్నంబున రయోద్ధతి మథనం బొనరించునెడ. 118

కం॥ ఆశరధినద్భుతంబుగ। నాశరసురసమితిగుండెలవియన్ లయవే
ళా శరధరగర్జా సం। కాశరభసమెసగ నొక్క కలకలమొదవెన్॥ 120

సీ॥ తొలుదొల్తఁదెప్పతెప్పలుగట్టిదోఁచె నద్భుతముగ సముద్రగ్రధూమపటలి
యావెంబడినెవిననయ్యెఁ గాండకటాహదళనకృచ్ఛిటచిటధ్వానసమితి
యావెన్కఁబొడచూపు నాక్రాంతదశదిశాప్రాంగణంబులవిస్ఫులింగవితతి
యంతటనుత్పన్నమయ్యె విశ్వజగ్రదసనదక్షభీకరజ్వాలజాల
ముడుగణముమ్రింద దిశలుదుందుడుకుజెంద। రజనిచరబృంద మాత్మహర్షంబుడింద
భానురుచిగంద భూమికంపంబునొంద। ముజ్జగముగుందఁబ్రాణముల్ మూర్ఛఁబొంద॥
వ॥ అట్టిసమయంబున. 122

కం॥ మొకమొకములుచూచుకొనుచుఁ। గకవికవై భర్గ పావక రవి కృతాంతులు
వికలప్రళయముతమచేఁ। బ్రకటితమగుభువి నిదేమిప్రళయంబనఁగాన్॥ 123

సీ॥ తతఘూలిఫాల నృత్యజ్జ్వలనజ్వాలికాఖర్వగర్వంబు నవహసించి
యంభోధిగర్భ సంచారచరద్బాడబ శిఖిశిఖాదర్పంబు చెదరనాడి
గహనసీమాది దుస్సహనటద్దావ సప్తార్చిద్మహార్చుల యురటుదెగడి
తక్షకసముదగ్రదంష్ట్రాగళద్విషకీలికీలాక్రీడ గేరడించి
యబ్ధినావిర్భవించి యాహాగవిరించి । మఘవదమరాశరవరాళిమదికి జాలి
గుచ్చె భూభృత్సకలభూతరోదసీ త । లకృతకోలాహలంబు హాలాహలంబు 124

వ॥ మరియునది వృహారికరపూటాస్ఫుటితపటుతర స్తంభగర్భఘుర్ఘరపటపటాత్కారపటలంబును దంభకిటిచటులఘుటఘుటార్భటికిఁ దుటారించు చిటచిటారచ్చటనకమలజాండకటాహంబు బెటబెటచలింపుచు బెగడుభూతంబులును నిగుడుసుల్కాపాతంబులును నరచుమృగంబులును బరచుఖగవారంబులును బగులుదిగ్భాగంబులును నొగులుజగంబులును దిరుగుధరణీతలంబును నొరుగుశైలకులంబును మ్రోయుమేఘమార్గంబును బెదరుసిద్ధులును జెదరుసాధ్యులును వ్రాలుములును సోలుగంధర్వులును దెరలుయక్షులును నొరలురాక్షసులును గలగుకిన్నరులును దొలగుకింపురుషులును డొల్లునురగలును బ్రదిల్లువిద్యాధరులును నై జగంబాక్రోసింపవర్తించి జ్వాలికామాలికలనెట్టించి బీరంబుదొట్టి సముద్భూతధూమధామంబులును సంవర్ధమానశిఖాస్తోమంబులును గలసిమెలసి రేబగలు నేర్పరింప రాకుండ సమకట్టి విస్ఫులింగంబులు దిక్తటంబులఁ జుట్టుముట్టి భార్గవుచందంబున సంక్షోభితదిక్కుంభినీశ్వరంబై రాముబాణంబుచాడ్పున సంతాపితపంక్తికంధరజీవనంబగుచు నభ్రమణ్ణివి భ్రమంబునఁగువలయసంత్రాసనకరాటోపంబుఁజూపి భీభత్సునిరీతిసింధురాజగర్భనిర్భేదవాదంబు ప్రకటించి సుదర్శనంబుపోల్కి పీతాంబరగౌరవంబుఁ గావించి విజృంభించిన

మ॥ ఇటు లావిర్భవమొందియాహాలహాలం బీరేడులోకంబు లా
క్కటక్రమింగంగమకించునయ్యాదుటనంగన్పట్టి ప్రాణుల్ పగి
స్ఫుటతత్పావకకీలలఁ బురపురంబొక్కం బురారాతి యు
త్కటహర్షంబునఁ జక్రిసంజ్ఞఁగని యార్తత్రాణపారీణుఁడై 125

చం॥ వనశిఖినంబుజోదరుఁడు వ్యాళనికాయమువైనతేయుఁడుఁ
దనుజతతిఁ సుదర్శన ముదగ్రతమస్వినినంశుమాలియుఁ
గొసగొని మ్రింగుచందమున ఘోరతమంబగు కాలకూట ము
క్కునఁగబళించెనప్పు డొకగుక్కగ జంబుఫలంబునుంబలెఁ 126

వ॥ ఈరీతిఁ గలుషజాలవాతూలమారుతంబగుతూలి యాలోలప్రవృత్తిశాలిర్దైయై మ హేంద్రజాలిపాలిత నాభీలహాలహాలకీలాకలాపంబుఁ గ్రోలి తదీయనీలకళ గళంబునఁ గీలు కొన నీలకంఠుండనఁ జాలి యుత్తాలజయశ్రీల నేలి వేలాలాస్యహాలాహాలింతేలివిలోకించ

కం॥ ఆడిరి పాడిరి వరములు । వేడిరి వీడిరి భయంబు వేలుపుచిగురుం
బోడులు జోడులు నుతులు । వేడుకఁ గూడుక నిశాటవీరులు సౌరుల్ 128

మ॥ కరకంజస్ఫుటరత్నకంకణ కనత్క్వాణస్వరూపాప్తవి
స్ఫురిత ప్రాభవ బాణమోక్షణక్షణాస్త్రప్రక్రియారంభమా
త్రరమాక్రీడితసద్భుజాంగణ గుణభ్రాజద్గిరీశాబ్జజా
మరముఖ్యావ్యయభద్రకారణ రణన్మంజీరశుంభత్పదా 129

పాదభ్రమకము

కం॥ శ్రీనుతనరసతనుశ్రీ ॥ మానితమాహిమణిపాశిమహిమాతనిమా
దానపదవాదవనదా । గానరతానఘయశోయఘనతారనగా 130

తోటకము.

శమదవిశేషణ చిత్తవిశేషణ సన్మునిపోషణ దైవతపా
గమఖరదూషణ జనవిభూషణ గర్జనభీషణ బాణకృతా
వమతివిభీషణ రాజ్యవఘోషణ వాక్యవిశేషణ భూమిసుతా
సముదితభూషణ సంగతతోషణ సత్యవిభూషణ కీర్తియుతా 131

గద్య

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్ష సంప్రాప్త సారస్వతవైభవ వాక్ప్ర
యామాత్యతనూభవ రసికజనహృదయంగమ సంగీతసాహిత్యగాంధర్వ
రాయసవెంకటమంత్రివర్య ప్రణీతంబైన లక్ష్మీవిలాసంబునందుఁ
బ్రథమాశ్వాసము సంపూర్ణము





# లక్ష్మీ విలాసము

——:(౦):——

## ద్వితీయాశ్వాసము

---

కం॥ శ్రీనయనోత్పలసితకర। దానవనిగ్రహీతభూతధాత్రీపునరా
దానవలవరణచరణా। జ్ఞానతమప్రివల్లయ వెంకటాచలనిలయా 4

వ॥ అవధరింపుము తిరువాతివృత్తాంతంబు జనమేజయునకు వైశంపాయనుండి
ట్లనియెఁ దదనంతరంబున 2

వనమయూరము.

వారకయపారగుణవారఘనశౌరా। వారమనుకంప దయివారఁగనుగొంచున్
వారిమరిచక్రతరవారిపురికొల్పన్ । వారిథిమథింప ననివారితరసోక్తిన్ 3

వ॥ యిట్లుపురికొల్పిన. 4

శా॥ బాలల్లాస్యవినోదముల్ సలుపుచుం బ్రౌఢోక్తి మెప్పించి పై
చేలల్లార్చుకొనంగ నవ్వుచు సుధాశ్రీకేచ్ఛనుత్సాహులై
యేలల్ లాగితలీలఁ బాడియు మహోహిన్ వొడియుం బట్టి హా
య్యేలల్లంచుమథించి రాఘనులు భూభృన్మౌళిచే నీగతిన్ 5

కం॥ తెరతెరగులై శిగలురులన్ । దరదరకలు దేరినుపుదాహ్వాన శరధిన్
మరితతిమందరగిరియు। త్తరిఁ దరిత్రాడునను సౌఖ్యదంబై తిరుగన్ 6

చ॥ ప్రకటభవద్గభీరతఁ బారము లేదన నేల నాదుధై
ర్యకళికచేగ్గొంతునని యద్రి సముద్భ్రమణచ్ఛలంబునన్
గకవికఁ జేయఁగాఁదలఁచి గంతులు వేయఁ గలంగ కబ్ధి దాఁ
బకపకనవ్వినట్లు కనుపట్టె వికీర్ణపయఃకరణప్రభల్ 7

సీ. చక్రిసాక్షాత్కారసంభ్రమోత్ప్లుతదక్షిణకరమహార్ణోర్మిచిత్రితతియనఁగ
భావిచంద్రోదయభద్రసూచకపురోనిర్యాతతద్భానునికరమనఁగ
జలమానుషీహస్తజలజాతవిలసితమౌక్తికరుచిరచామరములనఁగ
దతమారుతోద్ధూతతక్షణావిర్భవన్మందారకోరకబృందమనఁగ
నచ్ఛతవహించి కళలచేనందగించి । గరగరికఁ గాంచి రొండొంటిగడనమించి
చెలఁగె గిరిచాలనోర్ధ్వప్రసృతసుధాబ్ధి । గాఢతరవీచికాపయఃకణగణంబు 8

మ. పరిరంభించునటిత్యకాంతరజటాపంక్తుల్ జడల్ మాళిని
ర్ఝరమభ్రాపగభూషణంబు కటిరాజద్యోగినాభోగి సా
గరడిండీరకణాప్తిభూతియును గాఁ గల్పట్టె సాయుంతనాం
తరికృత్యప్రపురాంతకుండనఁగ మంథానాద్రి యంభోనిధిన్ 9

సీ. మహితభ్రమిక్రియామాలిపూరితగైరికరజోరుచుల మేరుగరిమఁ గాంచుఁ
గటకనటద్ఘురీకంఠణాకీర్ణమై ప్రాలేయశైలసంపదదనర్చు
మథనత్వరాంభోధిమధ్యపతత్పయోవృతిరాజతాచలశ్రీవహించు
వలయితాహిపవిషశ్వాసాతినైల్యమై యంజనాచలరేఖననుకరించుఁ
జూడఁజూడంగ వింతలుజొప్పడంగ । దనుజదివిజులుదోర్లీలఁద్రిప్పువేళ
నిఖిలభూధరవరవర్ణనీయపూర్ణ । భవ్యవైఖరి మంథానదివ్యశిఖరి 10

మ. తమవంశంబున దేవదానవులచేతం బ్రార్థనల్ గాంచె ను
త్తమ మీమందరమంచు రోహణగిరీంద్రం బబ్ధి రత్నాభిషే
కముఁ గావించినఁ దత్పరిభ్రమణవేగప్రస్తుతన్మస్తకా
గ్రమణుల్ రాలెఁ బయోధి తద్గరిమచే రత్నాకరాఖ్యం గనన్ 11

వ. ఇవ్విధంబున నవార్యధైర్యస్థైర్యధౌరంధర్యసురాసురవశ్యకరచాతుర్య వహదహార్యంబగు నేత త్కార్యంబున 12

మ. కలితౌన్నత్య తరంగసంఘములు శాఖల్ విస్ఫుటావర్తముల్
దళముల్ బుద్బుదపంక్తిగోరకము లుద్యత్ఫేనముల్ బూలగు
త్తులు గా నబ్ధి వదాన్యభూజములు తత్తుల్యంబులై పుట్టెఁ బు
త్రులు తారెందును దండ్రివంటిగుణవంతుల్గారె యూహింపఁగన్ 13

కం॥ ఇమ్ముగవితరణమునకున్ । గొమ్ములువచ్చెనని సారెకుం బొగడిసురల్
నెమ్మిగఁనుఁగొనఁ దదౌన్న । త్యమ్మెసఁగన్ గామధేను వబ్ధిజనించెన్ 15

వ॥ తదనంతరంబున

మ॥ తనకుంగూరిమిపట్టికాఁగలదుపద్మాకన్యకారత్న మ
ర్థినటంచున్ మఱిచెంగలించునసురక్తిం బొమ్మరిండ్లాటకై
మునుమున్నబ్ధిసృజించెనాఁ బొడమె నంభోరాశి నుచ్చైశ్శ్రవం
బును నైరావణదంతి శంభుశశికంబు శ్రీవిడంబంబునన్ 16

వ॥ మఱియు 17

మ॥ జనవంద్యుండు మహావదాన్యగుణవిస్తారుండు రాజత్కళా
ఖని సర్వజ్ఞశిరోవిభూషణము రేఖావంతుఁ డీక్షింపఁ జ
ల్లని చూపుల్ వెదచల్లుచున్ గువలయోల్లాసంబుఁగల్పింప నే
ర్చినయాసత్ప్రభుఁ డోషధీశుఁ డుదయించెన్ సింధుమధ్యంబునన్ 18

కం॥ వివరింప నెందుఁ బెరుగుఁద । రువఁగలుగుంగాక బాల్దరువఁ జేకురు నే
నవనీతపుముద్దయనన్ । ధవళాంశుఁడు తద్భ్రమాస్పదరుచిం బొడమెన్ 19

చ॥ అమితవికీర్ణభావమున నవ్యయనవ్యకళాకలాపసం
భ్రమమున నెన్నఁగాఁ "దనసమానముచంద్రుఁడు చంద్రుతోసమా
నముమఱితానె" యంచు భువనంబునుతింపఁగఁజాలునట్టిచం
దమున జనించె దివ్యమణి తత్సమయంబున నంబురాశిలోన్ 20

వ॥ ఇవ్విధంబుననిలింపులు సుధాలబ్ధికై వెండియుం ద్రచ్చిన 21

మ॥ ఒకమై శుభ్రమరీచిపూర మొకమై నుద్యజ్జపారాగకాం
తికదంబంబువెలుంగుకౌస్తుభము వార్ధిన్ సర్వలోకైకరం
జకభూతిం జనియించెఁ గైరవపయోజాతాప్తబింబద్వయాం
శుకవిస్ఫూర్తికిఁ దాన తావలమటంచుం దెల్పుచందంబునన్ 22

మ॥ భవకోపానలకీల నంగజుఁడు మున్ బాతాళముంబట్టి పూ

ర్వవిరోధింగని యాతనిన్ మగుడగెల్వన్ వేప్రయోగింప వె
ల్లువలై వచ్చుతదస్త్రసంక్తులన నాలోకింప దివ్యాంగనా
నివహంబుల్ శరథింజనించి వెడలెన్ విద్యుల్లతాసంపదన్ 23

తే॥ అతఁడు పాండిమకరుఁడు చూలాలిసుముఖ । సీమ నునుపండు వెన్నెలసిరులనింప
సరభసమునను దత్తనచక్రయుగళి । యల్లనల్లన మోములునల్లఁజేసె 24

చ॥ సవరణజాలముల్ విరిసి శైవలకుంతలముల్ మహోరుచిన్
దవిలి బహిర్గతంబుగఁ గనంబడె మౌక్తికఘర్మజాలవా
ర్ణవములఁ దేలఁగల్గె విపులంబుగవాలుఁగఁ గన్నులిందిరా
వ్యవహితపూర్ణగర్భయగు నంబుధివీచికి సాంద్రరోచికిన్ 25

వ॥ అంత 26

సీ॥ శీతాంశుజిత్వరశ్రీమించుమోముతో స్నేహంబొనర్ప సంధించుకరణిఁ
జేదోయిచెల్వుఁ దాల్చినవంచువర్ణింప సోయగంబున సరిజూచురీతి
భాసురక్రీడా నివాసయోగ్యములౌట బుద్ధి విమర్శింపఁ బూనుపగిది
దవపేరుదాల్చి వార్తకునెక్క బహుమానపాత్రంబులనుచుఁ జేపట్టునోజ
సన్నుతికినెక్కి యిరుగేల సరసలీల । విమలకమలంబులుధరించి కొమరుమించి
వేడ్కఁజెన్నొందుకలశాబ్ధివీచియందు । సిరులనుదయించెగుణపేటి శ్రీవధూటి 27

ఉ॥ కాచిననిచ్చఁ గల్పకనగంబులు చంద్రుఁడు దెమ్మటంచుఁ జే
సాచిననిచ్చఁ నేటిసరసంబనుచున్ బుధకోటులాడుకోఁ
జూచినమాత్రనిత్తు ననుఁజూడుఁడటన్నటులం గటాక్షదృ
గ్రోచులుమించనిచ్చె శశిగుల్కెడుకన్య సుధాబ్ధిజన్మయై 28

వ॥ తదవసరంబున 29

చ॥ "జనులెవరేని పూర్ణకలశంబుల నన్నుగఁజూచిపూజసే
సినఁ దదభీష్టసంపదలు జేకురఁజేయుదు,, నన్నచందముం
గనుపడ వెంటరాగ నమకట్టిన నాకమలావధూటివెం
టనె జనియించె భవ్యమగు నవ్యసుధాకలశంబు నీరధిన్ 30

మ॥ జలజంతుల్ వడదేర భూమిధరరాజంబూటల్ మీర ని
స్తులమాధుర్యముజాలువార దివిజస్తోమంబునోరూఱ ది
క్కులకున్ మోదముజేర నింద్రుమదినొక్కుల్ దీఱ నబ్ధిన్ సుధా
కలశంబుద్భవమయ్యె సౌరభమరుత్కాండంబులే తేరఁగన్ 31

వ॥ ఇవ్విధంబున 32

మ॥ ఫణినిశ్వాసజధూమ మద్ధినిదుధూపం బంకనాల్ గిన్నరీ
గణికాగానము లర్మ్మ్రోతలు తరంగధ్వానముల్ గా నిజా
నఱుకృత్యంబుల శైలహాలికు శివంబాడించు నాదేవతా
గణముల్ తత్పరికల్పితామృతరసగ్రాసేచ్ఛ నోరూఱఁగన్ 33

కం॥ సంతానంబులుగొని సుర । సంతానములరుగ సరభసంబున నిజహృ
చ్చింతామధనై రావణ । చింతామణికామ[illegible] సితహాయములతోన్ 34

కం॥ తలతలమనుఁగ్రొమ్మించులఁ । దలతలమని మేనికళలఁ దారుణ్యలతాం
త లతలవలెఁ దగు సురవని । తలఁ దలపలరంగవజ్రి తనపురిఁజేరెన్ 35

మ॥ జలధింబుట్టినయిర్వురందును సుధాసారాన్నముల్ వెట్టి య
య్యలఘుం డభ్రచరాళిఁ దృప్తిఁగనఁజేయం దా సురేంద్రుం డదు
జ్జ్వలసింహాసనమెక్కఁజేతునని యీర్ష్యం జంద్రునిన్ మీరఁగాఁ
బలెఁజింతామణి నిల్చెఁ ద ద్భువనశుంభద్భద్రపీఠంబునన్ 36

వ॥ తదనంతరంబ 37

కం॥ ఆశరధితీరమున సుర । లాశరధీరులు సుధార్థమై కడు వీరా
వేశమున "మాకుమా"కని । యాశలు పెలుఁగంగ జగడమాడుటఁగని తాన్ 38

సీ॥ తనదులీలాబ్జ మాననబింబమును దన్మరందంబు మధురాధరంబుగాఁగఁ
దననందకము సముదగ్రవేణియును దన్నిశితధారలు కనీనికలుగాఁగఁ
దనదుశంఖంబు కంధరమును దత్రత్యశోభితవర్తంబు నాభిగాఁగఁ
దనసుదర్శనము నితంబచక్రమ్ముతద్దివ్యతేజము దేహదీప్తిగాఁగఁ

చం॥ తనదువిలాసహాసములఁ దాలిమిదూలఁగ రాగసాగరం
బునఁబలుమాఱు మారుదనసమ్మనుచుఁ దేలుచు నిచ్చ మెచ్చఁగా
మునుకొనువారితో భువనమోహిని యాకువహానావియచ్చరాం
గన వలికెన్ వికస్వరవికస్వరభాస్వరసుస్వరంబుగన్ 55

కం॥ "నవతులు దిత్యదితివిలా । నవతులు మఱి వారికాత్మసంభవులగు మీ
నవతులమ్మర్త్యులు వారికి । నవతులుమన్ మీరు మీకునవనవలేలా? 56

చం॥ అమరులుమీరు తృప్తిఁగనునట్లుగ నందఱకేనువిందుగా
నమృతముఁబంచిపెట్టెద మహామహులార! మదీయవాక్యముల్
ప్రమదమునంగ్రహించి యటుఁ బంక్తులుసాఁగివసింపుఁ డంచిత
క్రమమమునననంచు సెంచఁ గల్కెతవలీలలచే నటింపుచున్ 57

కం॥ ఇంపై వీణారవముల ! సొంపై వాసంతికాప్రసూనరజము సం
థింపుచుఁ దగమీర గుభా । ళింపుచు ఘుమ్మనుచుఁ గుప్పళింపఁగఁ బలికెన్ 58

వ॥ ఇవ్విధంబున 59

ఆ॥ చిలువచెలువ గెలువ నలున గుజడయుం బి । త్తిరపు మెఱపు నెఱపునొఱపుఁజూపు
లనయవినయమెనయ ననయన్నై చిలుకల । కొలికికలికినలికిపలికెనంత 60

కం॥ ఆసారసదళలోచన । కాసారతరంగచలితకల్హార మరం
దాసారమధురవాక్య వి । లాసారవముల నిజాత్మలన్ భ్రమగొల్పన్ 61

వ॥ అత్తఱిం జిత్తజవికారోన్మత్తులై దైత్యులు బిత్తరిపలుకును త్తరంబులువినిత
త్తరింపుచు నిట్లనిరి. 62

సీ॥ భువనవిభవోస్తు నీకలికివేనలికిఁజూపులకు సన్మార్గవిభూతిరస్తు
ఫలసిద్ధిరస్తు నీపగటుమోవికి ముఖంబునకుఁ గళాకరస్ఫూర్తిరస్తు
నిస్తులారిజయోస్తు నీకుచంబులకు మధ్యమున కనంతసామ్రాజ్యమస్తు
విపులోచ్ఛ్రయోస్తు నీపిలసత్కటికి నూరులకు మహారంభోజ్జ్వలత్వమస్తు
సారరుచిశాలితాస్తు నీజంఘులకును । బదములకు నిందిరావాసభద్రమస్తు
మిగులఁ గల్యాణహేమసమృద్ధిరస్తు । మించు నీ మేనిపోడిమి కించుఁబోడి 63

తే॥ నీదులావణ్యమధురిమ నేత్రములను। దావికినవచస్సుధాధార చెవులఁ
దనివినొందింప నిత్తఱిఁ దదనుభవము । చాలదే మఱిఁ యమృతంబుచవుల కెలమి

చ॥ గరగరికల్ వహించి వెలుఁగన్ నిను ముత్తెముగా గణింపుచోఁ
దరళతదోఁచెఁ జూపులవిధంబుఁగనుంగొనినన్ విలోలతల్
మెఱసెను జంచలాతిశయమే నెఱపెన్ నిలువెల్ల జూడఁ నీ
వెరవున నీవునుం జపలవృత్తివిగావుగదా? తలోదరీ 65

చ॥ కచములనెల్లఁ జక్రగతి కన్బొమలం గుటిలప్రవృత్తి బల్
కుచములనిష్ఠురప్రకృతి గొంటరిచూపులవాఁడి మోవియం
దచలితరాగయుక్తి దెలియంబడె నైననుమీననేత్ర! నీ
యుచితవచోనురక్తిఁ జెవియొగ్గితి మింకిట మాటలేటికిన్! 66

సీ॥ తొలుతఁ జూచినచూపు తుదముట్టకొనసాఁగు మనసునిల్పుటయెల్ల మమత కెక్కుఁ
గావలెనన్న సంకల్పంబు చేకూఱు సౌలయించు నెదుఱుచూచుట ఫలించు
నటమీఁదఁ దనకార్యమపనయింపఁగనగు ననుకరించినజిహ్వాయరుచి సడలుఁ
ద్రిజగంబెఱుంగఁగోరినకోర్కులీడేరు భ్రమదీర సౌఖ్యానుభవముఁ జెందుఁ
బారవశ్యపువడయెల్లఁ దేరుఁ దుదను జిత్తజాతమనోరథసిద్ధిగలుగు
నుజ్వలస్మితముఖరుచియుక్తిగాఁగ। సత్కళాధర! సుధనీవొసంగితేని 67

కం॥ అవుఁగానీ మాటలకే। మవుఁగా దనలేము లేమ! యతనూత్సవహే
తువుగాఁగ నట్టివే నే। తువుగాక నీకేమి తలఁపుదువుగా లీలన్ 68

కం॥ వేరమ్ము సుధ యొసఁగ నీ। వేరమ్ము భవన్మృదూక్తివిలసన మంగీ
కారమ్ము మాకునని యవి। కారమ్మున సురలు తత్ప్రకారమెపూనన్ 69

తే॥ అమృతకలశంబుదంభనారాయణుఁగొని। వరుణతత్కరకాంతి సాయంతనంబు
పార్శ్వయుగమునఁదోఁచు రేఁబాలువోలెఁ। బంక్తిసాఁగిరి దనుజసుపర్వు లపుడు 70

ఉ॥ గగనద్వీపవతీశుద్రచ్చుటకుఁ దన్ గ్రక్కొన్న తీదీపుచేఁ
దగవాటిల్లువ్యథాతిరేకమున భూత్కారంబుగావించు
హృగభూవల్లభుకోఱలన్ నిగుడు ధూమజ్యోతులోనాఁగఁ జా
లుగగూర్చున్న నిశాచరామరులనాలోకించి యుంచద్గతిన్ 71

సీ॥ ఆకొంటిరికదయ్య యఖిలదిక్పతులార! యలసితిరికదయ్య యమరులార!
యాయాసపడితిరి యాదిత్యవరులార! యనుఱుసుఱయితిరి వసువులార!
కడుబడలితిరయ్య గంధర్వపతులార! ప్రొద్దుపోయెగదయ్య రుద్రులార!

తడవాయెనయ్యా విద్యాధరోత్తములార! శ్రమనుజెందితిరి నాసత్యులార!
యింపుమీరఁగ విందారగింపుఁడనుచు॥ మాటిమాటికివారలమనవివినుచు
నొప్పిదంబుగఁజేతులుద్రిప్పికొనుచు। వేడ్క సుధఁబంచిపెట్టె నావిధముఁగనుచు 22

కం॥ ఆహుతిభుఙ్ముఖపఙ్క్తిని। రాహుతిశేఖరుఁడుదనుజరాజనఁదగు నా
రాహువు నత్తతి సుధకై।బాహువుతగఁజాచి కపటపద్ధతిగొనియెన్ 73

ఉ॥ చిత్రముగొంపఁ దక్కపటశీలునిగన్గొని కిన్కతోనహో
రాత్రిపులంతరక్కసుఁడు రక్కసుఁడీతఁడనన్ దదున్నమ
ద్గాత్రులమాటలోను వెలిగా బలిగానిడె భూమికిన్ వఁరు
చ్ఛాత్రవుమస్తకంబు దనుజప్రకరారి కరాసిధారలన్ 74

కం॥ చండాడంబరమునఁదా। జెండాడెనురాహుశిరముఁ జెండాడి మహో
ద్దండగతి నిశితధారా। దండగతిన్ జక్ర మరులనండఁగఁడంకన్ 75

వ॥ ఇత్తెఱంగున నుత్తుంగరథాంగధారల విదారింపంబడియుఁ బుడమింబడక సుధాసంపర్కవిశేషంబునం బుటంబెగయుచుఁ దదీయశిరంబునుం గళేబరంబును వికృతాకారంబుల ఘోరంబుగా హాహారనంబులు గావింప నిలింపపరంపరాతనుకంపసంపాదనదక్షునిరీక్షణంబుల నిఖిలరక్షోధ్యక్షులు వీక్షించిదాక్షిణ్యంబు లుపేక్షించి తాలిమి శిక్షించి యక్షీణామర్షరక్షణపక్షం బుపలక్షించి యాత్మకుక్షింభరపరాయణులకుఁ దోడుగా నీమాయలాడి యెందుండివచ్చెనో? యెన్నినేర్పులువాక్రుచ్చెనో? యేమికైలాటముఁదెచ్చెనో? యెంతమోసపుచ్చెనో? జాలుఁబదివేలునచ్చెనని వెచ్చనూర్చువారును వారిధిమథనాయాసనుధాసారంబునకు నిరాయాసనంప్రాప్తనిజమధురాధర సుధారసంబునకు నొచ్చకుండం దొలంగించి రెంటికింజెడినరేవడిఁజేసిన యీ శాంబరీబింబాధరీభూమికను నిచ్చలో మెచ్చవలదా? యనువారును. వారకతెల్పు నాప్తులహితాలాపంబులదిమి మంత్రులనీతివాక్యంబుకలిమి దివిజులయెడమాత్సర్యంబులంజిదిమిబుద్ధిఁద్రాపించినముదిమిఁగడపటముదముదములైన యీ దనుజాధములననవలెఁగాక నెవ్వరేమిసేయుదురనువారును. వారువీరనకకూడఁ గోట్లుగూడివచ్చి మందరంబుఁదెచ్చి పారిపారి సముద్రంబుద్రచ్చి చేఁజొచ్చిన యమృతంబు గచ్చులాడికి మెచ్చిచూఱఁబుచ్చి వియచ్చరులకు నొగిరంబిచ్చి తమ్ముఁగట్టఁద్రాళ్లుతామేతెచ్చికొనిరనువారును. నమృతంబుపైనాశమఱలం ద్రిప్పుచు బెబ్బులులరీతి రొప్పుచు నొండొరులన్ దప్పుచు నిఁకమండాడంబులు బండా

డంబులు వృథాకొండాటంబులు మాని శౌర్యంబులుపూని యనిజేసినఁగాని పోనీయమ నువారును. నై బోరునలేచి రొంచినమదంబున నిశాచరవీరులబలంబులుగూర్చి బారు లుదీర్చి యుద్ధపడిజేర్చి మిన్నుమిట్టనార్చి యెదిర్చిన. 76

ఉ॥ అంతకుమున్నయింద్రుఁ డమృతాశనలబ్ధ బలాఢ్యులైన య
య్యంతకముఖ్యదిక్పతులనందఱఁగూడుక భూమిభృద్ధను
ద్యంతకుఁద్రొక్కి చక్రధరునాజ్ఞశిరంబునఁదాల్చినిల్చె నం
తంతకు బాహుదర్పమున నాహవకేళికి కాలిపోలికన్. 77

కం॥ ఆ సమయమున నశిజ్వాళ। రాసమయంబయ్యె సంగరాంగణ మది పై
పై సమయఁదొణఁగె నన్యో। న్యాసమశరధారలన్ సురాసురసేనల్. 78

కం॥ సెలగోలలచేఁబులుగులఁ। బలుకోలలమ్ముములఁ బరిమార్చుగతిన్
"సెలగో సెల" గని పోరిగొని। సెలగోలల నే పదాతు లితరేతరులన్ 79

కం॥ కరితురగరథపదాతులఁ। గరితురగీరథపదాతికటకంబులతో
సరిగడవనడపఁబోడవఁగ। నురువడిఁదలఁపడిన ఘోరయుద్ధంబయ్యెన్. 80

కం॥ ఆలమ్ముల వాలమ్ములఁ। గీలమ్ములఁగప్ప నసుర గినిసియొకఁడు క్రొ
వ్వాలునవొకవాలునఁ గర। ఖేలనమునఁ గేలు గాలు కీలెడలించెన్. 81

కం॥ దేవవిభుఁడొకఁడుతనలో। నేవలు గావదలివదలియెదిరినఁ గ్రుద్ధుం
డై వాఁడిచంద్రహాసము। చే వానింగదిమి యదిమిచిదిమెశిరంబున్. 82

కం॥ కుంతంబుల దంతంబులఁ। బంతంబులఁ బొడిచి కఱచి బలమఱదనుజుల్
గంతుల ఱంతుల దంతుల బంతులవలెఁగూర్చిరపుడు బాహోర్పటిచేన్ 83

కం॥ సురవీరుఁడొక్కశరమునఁ। గరిఫాలముఁగ్రుచ్చెఁ జక్కఁగావాలమునన్
గరిడుస్సియువలతురగం। బురగముక్రియఁద్రెళ్లిడొల్ల నురమున్ మెరిమెన్. 84

వ॥ అప్పుడు. 85

కం॥ చతురామరథనురుర్ఘ్నిత। శతధావటదర్ధచంద్రశరలాఘవఖం
డితపుండరీకతతిచే। శతచంద్రంబయ్యెనభము చర్చింపంగన్ 86

కం॥ అమితతురంగములు తరం । గము లసిదంష్ట్రజాలు మీలు కలితసితచ్ఛ
త్రములు శతపత్రములు గా । సమరతలంబమరె నమరసరసియపోలెన్. 87

మ॥ బహుధాయోధనసాధనాద్భుతకలాప్రౌఢిన్ విజృంభించి యి
ట్లహరీశప్రతిమానతేజులు నిలింపాధ్యుల్ సుధాసేవచే
గహనంబంటినపావకార్చులగతిం గన్పట్టినం దన్మహో
నిహతిం దుష్టనిశాటరాట్కుటజముల్ నిర్మూలముం జెందఁగన్. 88

కం॥ సెలకట్టకిటులనిఖిలా । శలకట్టకడలకుఁ దక్కుజనములు తమజం
కెలుకొట్టుబడుచుఁబరువన్ । గెలకొట్టుచు నవ్విరపుడు ఖేచరవీరుల్. 89

ఉ॥ అష్టమహావిభూతులకునాలయమైనభవాష్టమూర్తులో?
యష్టహరిత్కరీంద్రములో? యాహవదుస్సహశౌర్యధుర్యదు
ర్గాష్టభుజంబులో? యన శరాననభీషణపాణులౌ నమా
త్యాష్టకముల్గణింపఁగ మహాచలుఁడం దనుజేంద్రుఁడుద్ధతిన్॥ 90

కం॥ గహనావహ దహనాసహ । నహనా జహదస్త్రశస్త్రనైపుణిచే నా
గ్రహరీతుల నహరీశ న । రహరీశ మహోజుఁడై దురంబున నెదురన్ 91

చం॥ ముదమున నార్చి వేర్చి యటమున్నె బలంబులనిల్వరింపుచున్
మదమునఁ దత్ప్రధానులెనమండ్రుదిగీశులతో నమార్కొనన్
గదనముఘోరమయ్యె మహికాంతకుమిక్కిలిభారమయ్యె నా
ప్పిదములుదూరమయ్యె గ్రహబృందములందుఁ జమూరజోవృతిన్. 92

వ॥ అప్పుడు 93

సీ॥ తురగరింఖోద్ధూతధూళిధూసరితమై యభ్ర మర్కాస్తమయంబుఁ దెల్ప
నిబిడధ్వజార్కమాణిక్యదర్పణదీప్తి సాంధ్యరాగచ్ఛాయ సంఘటింప
శరవారితేభమస్త సముత్పతన్మౌక్తికములు తారాగణోత్కర్ష మెసఁగ
దనుజాధినాథైకధవళాతపత్రంబు పూర్ణచంద్రోదయస్ఫురణ నెఱప
దితిసుతామాత్యధాటికాతీవ్రరజని । రజనిచరవిస్ఫుటాట్టహాసజని సాంద్ర
చంద్రికలు బర్వ సౌపర్వసైన్యవదన । పంకజంబులు ముకుళితప్రాప్తిఁ గాంచె 94

చం॥ బిఱుసుననిట్లుమార్కొనుచు జేర్చి మహారథుఁజేర్చి పోరినన్
దొఱఁగుశిలీముఖంబులును ద్రుంగురథంబులు గ్రుంగుచక్రముల్
విఱుఁగుశరాసనంబులును వ్రీలుగజంబులు వ్రాలునశ్వముల్
తెఱలుపదాతులై సురలు దీనతనొందఁగ దిక్పతుల్ రహిన్ 95

చం॥ చెదరినవారునిల్చుచును జిక్కులుదీర్చి భయంబుఁదెల్పు చు
న్మదమునఁబోరుదైత్యవరుమంత్రులఁదాకి దిగీశు లుజ్జ్వల
త్ప్రదరములం దదీయరథరథ్యశరాసనకేతుసారథుల్
చిదురుపలై ధరందొరఁగఁజేసిరి యాశరరాజు గాసిలన్ 96

సీ॥ కూల్చెనొక్కని శతకోటిచేసురరాజు వ్రేల్చెనొక్కనివహ్ని భీమశిఖలఁ
జదిపెనొక్కని నుక్కుగుదియచేసమవర్తి మెధిపెనొక్కని ముష్టిమిసిమి నసుర
చిదిమెనొక్కనితల శితశరంబులఁబాశి యద్దిమెనొక్కని వాయు వతిబలమునఁ
దుడిచెనొక్కని వాలుదొరసియూథనదుండు పొడిచెనొక్కని శూలమునఁ బురారి
యంతకునివీటి కిట్లమాత్యాష్టకంబు। నరుగఁగని యేటుదాకినయురగమటులఁ
జటులగతిరోజుచును మహాచలుఁడు బలుఁడు।భిదురధరుమీఁదమదిఁ గిన్కగదుర నెదుఱ

కం॥ హితకోటినడుమఁ గమలా। హితకోటీరుఁడును దోడనే తేరవడిన్
శతకోటిధరుఁడుదాకెను । శతకోటివిశంబుతో నిశాచరనాథున్ 98

వ॥ ఇవ్విధంబున 99

చం॥ నొగనొగదాకి రథ్యములనూకి సురాధిపదానవాధిపుల్
మృగపతులట్ల బెబ్బులులరీతి మదేభయుగంబుభాతిఁ జి
త్రగతులఁ బోరుచుం దిశలువ్రయ్యలుబాఱఁగఁ గూయుచున్ మహా
శుగములునింపుచున్ మిగులశూరతఁబెంపుచు విక్రమంబునన్ 100

కం॥ ధనువులు ద్రుంచుచుఁ దనువులఁ। యనువులనొంపుచును ఖేటకాసిగదాదుల్
దునియలుసేయుచుఁ దనియక। యనియల్కనొనర్చి రింద్రుఁ డసురేంద్రుండున్ 101

సీ॥ శరభమై సరభసస్ఫురణఁజెంగటఁబోల్చు సింగమై తుంగమై చిత్రినిల్చుఁ
జిఱుతయై గురుతరస్థితిరొప్పికుప్పించుఁ గోలమై లీలమైఁ గోటరించు

ద్విరదమై దరదవై ఖరిజృంభణము నల్పు భుజగమై నిజగరస్ఫూర్తిఁ దెలుపుఁ
బవనమై జవనసంభరమున నుడిగూర్పు దానవై యేవ నెంతయును జేర్పు
సమరవిస్ఫురభుజబలచటులనిఖిల। దిగధిపతితతిదృఢతరధృతివిదళన
కరణపరిణతబహువిధకపటనటన। యమితవిమతకులుండు మహాచలుండు 102

తే॥ దానవేంద్రుండు మాయానిధానవృత్తి। మానకిటులెంతయును జాయమానబహువి
కారముల మారుకొని యహంకారమెసఁగ।దండనిల్చి యధిజ్యకోదండుఁడగుచు 103

కం॥ పసఁ జకనించెను నిశిత। ప్రదరంబుల దిగధిపతులఁ బది యిరువది ము
ప్పది నలుబది యేబదియ। ర్వది డెబ్బది యెనుబదింట వాసవముఖులన్ 104

కం॥ ఆ యమ్ములు వడివారల। యాయమ్ములు గాడిపాఱి యతరయమునఁ ద
త్కాయమ్ముల మిక్కిలిఁ బెను, గాయమ్ములు సేయ రోషకలితానసులై 105

చం॥ హరి విల్లుద్రుంచెఁ గేతనము నగ్ని హరించె యముండు సారథిన్
నుఱు మొనరించెఁ బై గొడుగు నుగ్గుగఁ జేసెఁ బలాశి వాజులన్
వరుణుఁడు గూల్చె మైమరువు వాయు గవల్చె ధనాధినాయకుం
డరదము ధూళిగూర్చె హరుఁ డయ్యసురన్ వెస నేర్చె నమ్ములన్॥ 106

కం॥ ఇటుల హతసాధనుండై। చటులహరిత్పతిశరాగ్ని సంధిత తను లం
పటుల భటులన్ మరల్పుచుఁ। బటులఘుగతి నగుగ డస్సి బలుగదఁ గొనుచున్ 107

స్రగ్ధర.

కుప్పించున్ సింహనాద క్షుభిత దిగిభుఁడై క్షోణి కంపమ్ము నొందన్
నొప్పించున్ సర్వగీర్వాణులఁ బ్రబలశిఖానోకహ స్తోకపుష్టిన్
దప్పించున్ భూరజోబాధకము శరధి నుత్తాల రక్తాతతాప్తిన్
మెప్పించుం గ్రొత్తఁగా నామెతలఁ బొదల సంప్రీతిచే భూతకోటిన్ 108

కం. ఈకరణి నతఁడు బహుమాయా। కరణీయములఁ బోర నరిదోర్బల లుం
ఠాక రణి వజ్రి ఖేచర - లోక రణిత విజయకాహళుండై యలుకన్. 109

మ॥ చలమొప్పారఁగ నర్ధచంద్రశరముల్ సంధించి రెండున్ మహా
చలబాహాయుగళంబుఁ దున్మ మణిరాజశ్ఛేటకోద్యద్భుజా

ర్గళమం దొక్కటిత్వరం దిరిఁగ నాకాశంబునన్ భానుమం
డలమున్ వెన్కొని కేతు వీకరణిఁ జుట్టంబెట్టుచున్నట్టుగాన్॥ 110

కం॥ తెక్కులు విఱిగినకొండన । రక్కసుఁడిటు నొచ్చియుంగ రాళాస్యమునన్
వెక్కసమగు నెఱమంటల । గ్రక్కుచు బలముకునుఱికి కబళింపంగాన్ 111

మ॥ లయకాలాకృతినంతనింద్రుఁ డెదుటన్ లక్షించి దంభోళిచే
రయమొప్పారఁగ నమ్మహాచలునిమూర్ధం బుద్ధతిం ద్రుంచె ని
ర్భయవృత్తిం జయలక్ష్మి దన్నువరియింపన్ సొంపువాటింపఁగా
నియతప్రక్రియఁ దక్కిరీటమణులన్ నీరాజనం బిచ్చుచున్॥ 112

వ॥ అంత

కం॥ హతశేషనిశిచరావళి హతశేషనివాసమందుఁ దతజయరమతో
శతమన్యుఁ డుత్సవంబున । గతమన్యుం డగుచు శౌరికడ నిలుచుటయున్॥ 114

కం॥ కురిసె దెటివిరులవానలు । విరిసె దిగం[illegible]మము విస్ఫుటరవమున్
మొరసె సురదుందుభులు కడు । మెఱసెన్ నటనమున రంభ మిగులం జంటన్॥

చ॥ ప్రణుతసుధీ మనోభవనరంజన దీవనదివ్యకన్యకా
మణి విమలాచ్ఛకైరవ హిమచ్ఛవిరూప విరూపయుక్కృత
ప్రణమ జపప్రసన్నతనుభాగవనీప వనీపకార్తివా
రణమహిమానుభావ గుణరత్నకలాప కలాపభూషణా॥ 116

కం॥ చరఖచరసుఖచరాసుఖ । చరహరశబరేశవినుత చక్రదళితభీ
కరమకర ఖరకరాహిమ । కరశుభకరనయన పన్నగప్రభుశయనా॥ 117

ఉత్సాహవృత్తము.

కలహకీలక విధిబాలక నుతశీల ! పద్మినీ
దళవిశాలనయన ! తాళధారిఖేల! దోర్బలో
చ్చలితశైల ! జలదనీల ! స్వర్ణచేల ! వర్ణని
ర్మలకపోలఫలకలోల ! మకరలీలకుండలా! 118

గద్య.

ఇది శ్రీమద్వేంకట రమణకరుణాకటాక్ష సంప్రాప్త సారస్వతవైభవ వాక్క
యామాత్యతనూభవ రసికజనవ్యాయంగమ సంగీతసాహిత్యధౌరంధర్య
రాయసవెంకటమంత్రివర్య ప్రణీతంబైన లక్ష్మీవిలాసంబునందుఁ
ద్వితీయాశ్వాసము సంపూర్ణము.



# లక్ష్మీవిలాసము.

—:(o):—

## తృతీయాశ్వాసము.

—

కం॥ శ్రీరమణీ రమణీయ వి। హారోచిత హారయుత భుజాంతర ! పవనా
హారిఫణాఫణరత్న। హారిపదక్రమణ ! వెంకటాచలరమణా! 1

వ॥ అవధరింపుము తరువాతివృత్తాంతంబు జనమేజయునకు వైశంపాయనుండి ట్లనియెఁ దదనంతరంబున. 2

కం॥ కలకలకలకుమూలముగను। కలకలముజనించె నపుడె గ్రక్కునరంభా
కలకంఠీభావము కల। కలనగు చుడిగె విమల కమలాక్షుండై॥ 3

మ॥ ఘనశృంగారరసాన్వితంబగు నిజాకారంబుతో నిందిరా
వనితారత్నము చెంత శాంతసుమనోవల్లీ సమీపావలం
బనరోలంబములీలనుండి జయశుంభద్ధ్వాతిచే నిట్లు వ
చ్చినజంభారి బహూకరించి యవు డాసింధుప్రతీరంబునన్॥ 4

సీ॥ రవిచంద్రబింబముల్ రమ్యణీయ మణిమౌక్తికాతపత్రద్వయంబగుచునిల్వఁ
దరళితారుణ గరుత్తతులచేఖగరాజు మహనీయబిరుద చామరములిడఁగఁ
జంకఁజేతులు వెట్టి జలజాసనేశాన కులిశభృత్ప్రముఖులు గొలువుసేయ
వేర్వేఱఁబొడఁగనువిబుధులఁ గనక వేత్రమున సేనాని పరాకుదెల్ప
సురగపతివేయుఁబడిగెలు నరిగెలెత్త। నమరు తద్భోగరచితసింహాసనమునఁ
గమలయును దానుఁ బేరోలగమున నుండె। దివిజవృద్వర్తి పరవాసుదేవమూర్తి

చ॥ శరణని చేరి మ్రొక్కెడరుచారణకిన్నరసిద్ధసాధ్యఖే

చరగరుడోరగాధిపులు స్వామి ! పరాకవధారు దేవ ! హె
చ్చరికయటంచు వేత్రధరసంతతి హుంకృతులన్ నుతింపఁగా
వఁ విభవాప్తి నిట్లు హరి వార్ధిదరిం గొలువున్న యత్తఱిన్॥ 6

సీ॥ శరజాతవిఖ్యాత సంపదనెసఁగు బృందారకవాహినీ నాయకుండు
కలితతరంగ రంగత్కళాకేళిచేఁ తేజరిల్లు సరస్వతీప్రియుండు
రాజమానానంత రత్నసంగతిఁ గాంచి యలరు కుముద్వతీప్రాణవిభుఁడు
విశదమైనదిగంత విశ్రాంతకీర్తిచే శ్రీమించు తామ్రపర్ణీవిభుండు
శైలజాతాశ్రయోచిత సద్గుణాళిఁ । జెలఁగి యుత్సాహమునఁ బొంగు సింధుమాళి
యపుడు తనకూఁతు నిందిర నంకపాళి । నుంచి కొలువున్న హరిఁ బొడఁగాంచు బాళి॥

సీ॥ లాలితోత్కలికావలంబితోన్నాళ ప్రకాశిత పుండరీకంబులెత్తి
శుభకరకంకణస్ఫుటనాదసంగతి విశస[illegible] తద్వితతిఁ దాల్చి
భూరికాండోచ్ఛ్రయస్ఫురితచాంచల్య భాస్వర మీనమకరధ్వజంబుఁ బూని
యభ్రవిభ్రాజన్ముఖామోద రుచిరానురాగ షట్పదగీతరవముఁ జూపి
విమలశృంగారరసమెల్ల విస్తరిల్ల । నదులు మూర్తీభవించి యున్నతి వహించి
వెనుక నూడిగములు సేయ వైనతేయ । గమనుఁ గనవచ్చె శుభవాటి కడలి మేటి 8

మ॥ పదలాలిత్యములన్ సరస్వతి కళాపాండిత్యముల్ జూప బా
హుద కైదండయొసంగ వేత్రవతి సాహోనాదముల్ సేయ న
ర్మద హాస్యోక్తుల నవ్వఁగిల్కొలుప సమ్యగ్ఖ్యాతి నీరీతి వ
చ్చి దయారాశి రమావిలాసిఁ బొడఁగాంచెన్ వార్ధి సేవార్థియై 9

కం॥ అడుగులకుఁ దనగభీరత । మడుగులు గానించి మ్రొక్కి మధుమర్దను బ్రా
నుడుగులఁ బొగడుచు వెడగుల । బడుగుల మముఁ బ్రోవుమనుచుఁ బ్రార్థనతోడన్

కం॥ హారముఁ జంద్రకళద్యా । హారము సౌఖ్యతర స్వప్రహారము శ్రితనీ
హారము నొక్కటి గొని యుప । హారము గాఁ జేసి శ్రీవిహారికి ననియెన్ 11

కం॥ తారకపటలీనటన వి । దారకవర్తులతఁ దనరుఁ దావుల నిది బృం
దారకనాయక వనమం । దారము నుహసించుఁ బొగడఁదరమె గుణాప్తిన్ 12

మ॥ రమయున్ నీవు వినీలసౌధమున వర్షావేళఁ గ్రీడింపుచోఁ
దమ యామ్రేడితమైన రాత్రులఁ దదంతస్థాంతరిక్షావకా
శమునన్ నిర్మలతారకాప్రకరమై చంద్రోదయంబై యథా
ర్థముగా వెన్నెలగాయుచుం గురియు నీహారంబు నీహారమున్॥ 13

సీ॥ క్రీడావనము విలోకింప నేగెడువేళఁ దరులెల్లఁ గోరకితముల నేయు
ద్రాక్షపందిటిక్రిందఁ దగవిశ్రమింపుచో రసగుళుచ్ఛములు తత్ప్రతిజనించు
బంగారుచవికెలోఁ బవ్వళించిన మౌక్తికములజల్లుల మేలుకట్లఁ గూర్చు
రత్యంతమునఁ గల్హారాలవసియింపఁ గర్పూరధూమమై కాకఁ దీర్చు
వేగ నీదండ నీదండ వెలయు రమయు । నీవు వేమాఱు వే మారు చేవవింటి
మోతలాలించి లాలించి "ముదిత! మనకు । బ్రాణమీహార విహారతాప్తి కనఁగ

కం॥ నీపేరునకున్ మొదలుగ । నీపేరు చిరవ్రతముల నెసఁగ నొసిరియై
నీపేరుగమునఁ దత్కృప నీపేరున వెలయు హరి! గ్రహింపుము దీనిన్ 15

కం॥ దామము దవగుణితశుధా । ధామము పరిమళ విదళిత తామరస దళో
ద్దామము మోహనమగు నీ । దామము నీ కరుణఁ గొనఁగదా మముఁ బ్రోవన్ 16

కం॥ దామోదర నామమునన్ । దామోదరసంబు నీకహార్యమె? హరి! యీ
దామోదర విదురాక్రం । దామోద రథసము నిన్ను నలరించుఁ జుమీ 17

కం॥ కొమ్మని యిది యురమున నిడు । కొమ్మని హారంబొసంగఁ గుతుకాన్వితయా
కొమ్మ నిరీక్షణమునఁ జే । కొమ్మనినూఁచింప నందుకొని శ్రీపతియున్ 18

ఉ॥ ఆ వరతారహారముఁ బ్రియంబునఁ జేరదవై చికొంచు శ్రీ
దేవిమనోరథంబుఁ గని తీసి తదీయగళంబుఁ జేర్చు శ్రీ
డావతి యూర్మినీయ మగుడం గొను నిచ్చు గ్రహించు నిట్లు లీ
లా విభవంబు నల్పి నవలా కొసఁగెన్ హరి కంఠహారమున్ 19

ఉ॥ ఈకరణిన్ నటించి దనుజేంద్రవిరోధి పయోధిజాచి ర
త్నాకర! యేమి నీకు? శుభమా? కుశలంబుగ నున్నవారె? మం
దాకినియాదిగాఁ గలుగు దారలు బ్రేమముతోడ నండజా

నీకము నీదుగర్భమున నిశ్చలసౌఖ్యమునన్ వసించు నే?

కం॥ సాతనయ నిరతసాధు న। సాతనయతిదినుతిఁగాంచుసాకతటిని వి
ఖ్యాతనయ నిన్నుఁగొల్చెఁగ। దా? తనయునకు ప్రసక్తిఁ దనరినభక్తిన్ 21

కం॥ నుడివితివే మేమా మము। వెడగుల బడుగులను బ్రోవవేయని పెక్కుల్
దొడఁబడనవు డేమీ నీ। వెడగుతనము బడుగుతనము విను వివరింతున్ 22

తే॥ సమరనాశ్రితబహుజంతుసంతతులకు। సంతతము జీవనము యథేష్టముగొసంగి
గుణగభీరత గోత్రరక్షణమొనర్చు। వెడగుతనమెల్ల నీయంద వెలసెఁగాదె? 23

కం॥ ఈనాకజనపతికి గజ। దానము నమరులకు నన్నదానము మఱి గో
దానము నొసఁగినబడుగువ। నూనత శ్రీమూర్తిఁ దాన మొసఁగవె? నాకున్ 24

కం॥ ఇంటం దగుభాగీరధి। వంటి గృహిణి తుంగమామవంటి కొడుకు శ్రీ
వంటినుత గలిగి మను నీ। వంటిసముద్రునకు సరియొవరు గృహమేధుల్ 25

తే॥ ధృతిని మముబోంట్లవాంఛలుదీర్పఁజాలు। సిద్ధసంకల్పునకును వాంఛితముగలదె?
ధైన నొసఁగదవేడు మేమైన వాంఛ। గనకగలిగిన నిందిరాజనక! యనిన 26

కం॥ విమలాంతఃకరణుండగు। కమలాజనకుండు నిటలఘటితాంజలియై
కమలాక్షునకిట్లను నా। గమలాలితచరణ! నీదు కరుణాదరణన్ 27

కం॥ సేమమున సర్వదా మనఁ। గా మము నీవరసి ప్రోవఁగా మఱిమాకున్
స్వామినిరంతరమును బరి। ణామమె కాకితరవ ర్తనంబులుగలవే? 28

గీ॥ అరుణశశినేత్ర! మామీఁదికరుణతోడ। నొసఁగి సిరులెల్ల మాకు నీ వొసఁగినదియొ
మితముతో కెప్పుడవియొ కామితములెల్ల। నొదవఁజేయుచుంగ నేమిటఁగొదువ మాకు

కం॥ ఈరికొలె త్తినవామదిఁ। గోరికమఱియొకటిగలదు గుణరత్ననిధీ
చేరిక మీయానతి కవ। తారిక గా విన్నవింతుఁదగవినుమనుచున్ 30

కం॥ వాణీశశర్వాణీ గీ। ర్వాణీ వేణీనిబద్ధ రమ్యమణీయమణి
శ్రేణీఘృణినీరాజిత। శోణితపదపద్మునపుడు చూపి ప్రియోక్తిన్ 31

మ॥ శ్రితరక్షామణి! యెల్లవారువిన నే శ్రీమూర్తిదానంబుఁ జే
సితినీకంచు గణించి కట్టిపలుకుల్ శీర్షంబుగాఁజేసి నా
సుతయాశ్రీవనితన్ మదీయగృహముల్ శోభిల్లఁగల్యాణ సం
గతిచేఁగైకొని నామనోరథము సాకల్యంబుగాఁగూర్పవే. ౩౨

కం॥ శ్వేతద్వీపముగలదట । వీతిద్విపరథభటాది విహారణమున కు
ద్యోతితవిస్తారంబై । యేతద్విభవార్థమగుచుని దెనాయందున్. ౩౩

కం॥ కావునవచ్చటనగరముఁ । గావింపననుగ్రహింప గరుడధ్వజ! మీ
పై వాహికశుభమునకిర వై వాహినిఁగాంచు నదియు నని ప్రార్థింపన్ ౩౪

కం॥ ఇందిర నరవిందవనీ । మందిర నతినీలకచసమాజక్లాంతేం
దిందిర నీక్షించి సుధా । స్యందిరవంబెసఁగ హరి త దనుమతిననియెన్ ౩౫

గీ॥ వారిజారాతిజనక! యోవారిధీశ ! వేడుకనుమాయభీష్టంబు వేడుకొంటి
వింతయొప్పున? యీమాట వింతయుచుల ॥ నర్థి నాలాగె నేను గన్యార్థినగుచు. ౩౬

కం॥ ఇప్పడతుక నతివిభవము । జొప్పడఁ బెండ్లాడిసకలశోభనములచే
నుప్పతిలసిరులఁ దనరుచు । నప్పతి! నీయిల్లిటంపు టల్లుఁడనగుదున్. ౩౭

తరల॥ అని యనూనగతిన్ రమాపతి యానతీయ దయాళుఁడై
యనియనూనమటంచు ధన్యుఁడనై తినంచు శుభప్రధా
ననియతిన్ ఫలియించె నా జననంబటంచు ముదంబుతో
న నియతస్థిరభక్తిఁ జక్రికి నర్థిమొక్కె సుదారుఁడై ౩౮

మ॥ వనజాతేక్షుణుఁడంత హర్షమున విష్వక్సేను వీక్షింప న
ర్థి నతండున్ దదనుజ్ఞఁ గైకొనిసితద్వీపంబునం దాత్మకాం
చనవేత్రాగ్రమునన్ సృజించె రహి మించన్ సర్వసంపత్సమ
గ్రనివాసంబగు రాజధాని విలసత్ప్రాకల్య సంధానియై ౩౯

సీ॥ ఏవాడఁజూచిన నేపారుశశికాంత శశికాంతవేదికాసరసరాజి
యేజాడఁజూచిన రాజిల్లుసురసాల సురసాలతరువన స్ఫురితపంక్తి

యేమేడఁజూచిన శ్రీమించునిభరాజి నిభరాజనుతకళా విభవకేళి
యేప్రొద్దఁజూచిన నింపొందుఘనసార ఘనసారసామోద కలితరీతి
యచటికోటలు పేటలు నలరుఁదోఁట। లచటిచిన్నెలు వన్నెలు నసుఁగుఁగన్నె
లచటిశుకములు పికములు నలలరకము। లేమనఁగవచ్చు నగవచ్చు నెంతుమనిన.

మ॥ కమలానాయకు మెచ్చుఁజేయుటకుఁ జక్రం బిప్పురిన్ సాలచ
క్రముగాఁబోలు నిజాయుతోరుపటుధారల్ కొమ్మలై కమ్మ ని
క్కముగాదేని సుదర్శనోచిత మహత్త్వంగాంచి తేజోమయా
గ్రిమమై నిర్మలపాంచజన్యపరమైత్రిన్ సర్వదా మించు నే? 41

చ॥ ఉరుతరభూతి భోగులకు యోగులకున్ మహదాశ్రయంబులై
పరఁగ ననేకదేశగుణభావ్యులు మీరలు నాసమానులే ?
ధరనని యాక్రమించుగతిఁ దద్భవనంబులుచుట్టుముట్టెఁబెం
పరయఁగ సాలమూలమున నగ్రమునన్ [illegible] బుదగ్రమై. 42

మ॥ సముదారోన్నయ పేయతోయ విలసత్స్వర్ణ నాళీకనా
ళము లచ్చోఁదగు కోటపాదుఁబడిలీలం డిగ్గి పాతాళలో
కములన్ ద్రేలఁ దదీయవాసు లచటన్ గాంక్షించిడోలావిహా
రముగావింతురు తత్పరీమళసమీరగ్రాసబద్ధాశలన్. 43

చ॥ ఘన మణిగోపురాగ్ర విహగప్రభుకేతువుఁగాంచి భీతిచేఁ
జనుఫణిరాజరజ్జువులు సారె రథాశ్వములం దగిల్చి ప
ట్టణమున కివ్వ లవ్వల హుటాహుటి నర్కుఁడు పోవ దక్షిణా
యనమును నుత్తరాయణము నాఁ దగెఁదద్గతులిప్పుడున్ దివిన్. 44

చ॥ అలఘు కళాసమగ్రత ననంతపదాభిరతిన్ జెలంగ మం
గళగుఁరుసౌమ్యశౌర్యరుచికాంతసభావళి రాజరాజహం
సులకు విహారయోగ్యమగుచొప్పున నప్పురి సూర్యసోమవీ
ధులు చెలువొందుఁ దన్మహిమతోఁదులతూగువిచిత్రవైఖరిన్. 45

ఉ॥ శ్రీవిలసిల్లు క్రొంబసిడిచిత్తరుమేడలయం దనేకతా
రావళి యింపుతోఁ గువలయస్ఫుటవాసనలం దనర్చు శ్యా

మావిలసద్విలాసము లయుండగఁ గసిమర్గుకొన్నయా
కైవడిఁ జొట్లఁ బెట్టు శశికాంచనపాలముచుట్టునచ్చటన్ 46

ఉ॥ తోరపుసంపదన్ బురి చతుష్పథమధ్యమునందుఁ బొల్చు శృం
గారపుమేడయొక్కటి యఖర్వగతిన్ జలరాశిఁ ద్రచ్చఁ జే
కూరినదాట శౌరిదయకున్ దగి ముజ్జగమెన్నఁ దన్మహా
గారమునన్ బ్రతిష్ఠగఁ గావసియించిన మందరంబనన్. 47

చ॥ ప్రమదలు వీటిసౌధములపై నిశ టాభ్రసరిత్సువర్ణకం
జములనుగాంచి "యాత్మరుచిసౌరభముల్ గొనుమ్రుచ్చు లంగమం
చెములివె" యంచుచాటు వతిచిత్రగతిన్ విదళించి కేశపా
శములనుగట్టివైతు రతిఝుంకృతులన్ మొరవెట్టబెట్టుగాన్. 48

శా॥ ద్వీపంబొక్కటి శ్రీమనోహరునకున్ వీడై యమోఘాకృతిన్
జూపట్టన్ దమదీర్ఘతల్ వృథయటంచున్ జింత నాద్యత్తర
వ్యాపారోద్భ్రమయ ముజ్జగించి యుచితంబర్థించి భ్రాంతేతర
ద్వీపంబుల్ విధియాజ్ఞచే ద్వీపములై విఖ్యాతిమించెన్ రహిన్ 49

శా॥ యాదోరాశిమథింపుచో జలజగేహావిర్భవప్రాప్తియుం
దాదిం దా రనురాగవృత్తిఁ దగి తత్ప్రారంభసీతార్హ్య కే
ఖాదంతంబుగ నుజ్వలద్గతిఁ దరంగంబుల్ తురంగంబులై
సౌరుల్ మెచ్చఁగఁ దేజరిల్లునచటన్ జారుద్రువాలంకృతిన్. 50

ఉ॥ కొక్కులుచక్రముల్ బసిడికేఁకులుకమ్ములు మాళినిర్ఝరుల్
టెక్కియముల్ పటంబులు గుటీరతతుల్ బగడంపుఁదీవియల్
చక్కని త్రాళ్ళుగాఁ బురినిసాగరగుప్తగిరుల్ రథంబులై
గ్రిక్కిరియన్ మురారినరిగెన్ హరి జిల్వకుటిల్వఁగావశన్. 51

చ॥ నిరతము సాధ్వియైనగృహిణిన్ దలవాకిటనుంచి బుద్ధిమం
దిర మునబుద్ధిఁ బెంచ కతినింబలఁ జివ్వలఁ దిండిఁ జేసితా
మరుతరసత్రభోక్తయయి యోగియుఁ భోగియుఁ గానిబ్రింహ్మ నే
వెరవున మెచ్చ రప్పురమువిప్రులు నీతికళానముగ్రతన్. 52

చ॥ తొడరి ప్రదోషమందుఁ బనిదుర్మతిఁ బూనరు సుందరాత్మమి
త్రుఁడు సిరిచెందినన్ గురుని దోషులుగా రహోభీతిఁ జెందర
న్నడుఁ గలదైన సారసవనమ్ము టసంపదమాయఁ జూచి రే
ర్పడనకలం కవృత్తిఁ చురి రాజిలు రాజులు రాజమాత్రులే? 53

చ॥ కరువము మేనదొట్ట నలకాపురిఁ గోపురముల్ వసించుచున్
వరుసని ధానముల్ నవతవాటిలఁ దానొకమూలఁ జేరఁ బెం
పరధనదుంబ్బడనన్ వినిదయాళువులై యతఁడుం దకీర్తిచే
నిరవుకొనంగ సంచితములిత్తురు సారెఁబురీకిరాటకుల్ 54

ఉ॥ ముమ్మరమైన ధాన్యములముద్రలు వేయఁ జెందుజాళువా
దుమ్ములఁ బంతమైనతనతోయములందగు పైడితమ్ములం
దమ్ములు గాంచి గంగమదిఁ దాఁ జెలఁగందగి రందుఁ బాదజాల్
తమ్ములుగల్గిగా రవిలుధన్యులసంపద [illegible]న్ 55

ఉ॥ బింకపు గబ్బిగుబ్బెతల బిత్తరి చూపులు మేని తావులున్
గొంకక కాంచి లీల మెలగున్ మలయానిలుడక్షినిక్ నిరా
తంకమరం దసారణుల దాఁటుచుఁ దన్నెగమీటి చన్నయా
జంకపడావుమావి చటఁ జిక్కఁడు గాయని చూచుకైవడిన్. 56

ఉ॥ ధూపితకంకణావలులతో నలమానవుహోర్మి కాంత లీ
లాపటలంబుతో సమవలంబిత పుష్కరవిభ్రమంబుతోఁ
గై పువహించుఁ గోకనదకాంతులు చెంతలఁ గొంతరింపఁగా
నాపుటచ్ఛదనంపుఁ గమలాకరముల్ కమలాకరాకృతిన్. 57

మ॥ బిసముల్ బాహులు మాకరందరసముల్ బింబాధరంబుల్ వల
ద్భుసలంబుల్ గురు లంచపత్రములు నేత్రంబుల్ క్రికాస్త్రాక కో
కసమాజంబులు గుబ్బచన్నులుగ వేడ్కన్ బద్మినుల్ పద్మినీ
వినరంబయ్యెనొ? నూత్నసృష్టిసన తీవిన్నింతు రింతుల్ పురిన్. 58

సీ॥ పురుషోత్తముఖ్యాతిఁ బొరయుని ప్రతిష్ఠుండు శ్రీకాంతవై భరఁ జెందని సతి

కుంభినీశస్థలిఁగోరని గజములు హరిసమాఖ్యనెనంగనట్టి హయము
పీతాంబరస్ఫూర్తిఁ బెరయని మేడయుఁ జక్రభృత్పటిమఁ గాంచని కొలంకు
మధుసూదనవిభూతిమలయని తీవయు మానవాలంకృతిమనని తరువు
వెదకినఁ లేక యీవీకఁ విష్ణుమయము సర్వమనుమాటఁ దెల్పుచు సకలవస్తు
సంచయముల వికుంఠతఁ గాంచుకతనఁ బరఁగెనప్పుడు వైకుంఠపురమనంగా 59

మ॥ ఘనచాతుర్యము మీర నీగతి సమగ్రశ్రీలఁ దేలన్ సృజిం
చిన యాశోభనరాజధాని కలుముల్ సేనాని శ్రీజానితో
వినతుండై తగవిన్నవింప మఱియున్వృద్ధోరుకల్యాణకాం
తు నతిప్రీతమనస్కుఁడై నిఖిలలేఖవ్రాతముల్గొల్వఁగాన్. 60

చ॥ గరిగరికల్ తటిల్లతలగచ్ఛులడంచు బదారువన్నెబం
గరుగరులార్చుచున్ వలనుగా సముఖంబుననున్న వాజిశే
ఖరు గరుడున్ ముదంబునను గంతముఁ దట్టుచు నెక్కి చుట్టువా
ల్గారదొరసాని దాను నతితూర్ణగతిన్ వియదగ్రపద్ధతిన్. 61

శా॥ ఈరీతిన్ గమకింపుచో సురనదీహేమాంబుపూర్ణుల్ భుజం
గారాతిచ్ఛదజాత వాతహతిచే నంతంతఁ బైఁ గప్పఁ ద
చ్చారుత్వంబున ధర్మచేలులగుచున్ సారూప్య భూతిన్ విరు
చ్చారు ల్లయికొని కొల్వఁజక్రిచనెఁ దేజఃపేటి కవ్వీటికిన్. 62

మ॥ చని చెంత్తన్ దలినీటితమ్మికిఁ బరిష్కారంబుగా గర్భికా
భినవశ్రీనిడు హేమవప్రపటలిన్ బెంపొందుచున్మించు నా
ఘనవైకుంఠపురంబుఁ జేరి త దసంఖ్యాతార్ఘశృంగారముల్
గనుఁగొంచు న్మ్రొగసాలఁ జొచ్చి శుభలీలన్ రాజమార్గంబునన్. 63

కం. అకలంకవైభవంబున । మకరాంకగురుండు రాగ మత్తాళిదం
బకవేణుల్ బిసపాణుల్ । శకటాంగశ్రోణు లగు నచటిపూబోణుల్. 64

కం॥ కనుఁగొనఁ దివురునభీష్టము । కనుఁగొనలం దివురులొత్తఁగా నెక్కొ రాగిన్
గనక నగోపమితములై । కనకనదును సౌధవీథికలకున్ గడకున్. 65

మ॥ తన సెమ్మోమున బొట్టిడంగొనిన యాదర్శంబుతో నబ్జలో
చన యొత్తించె నొకర్తు శ్రీపతిగనన్ స్వామీ! ముఖశ్రీలసె
ల్లను నిచ్చల్ హరియింపఁ జొచ్చె నడియాలంబాల్ విమర్శింపు గ్రి
క్కన నద్దం బిదిగో విశాలమునఁ గన్గొమ్మన్న చందంబునన్. 66

ఉ॥ [illegible]రవగంధి యొర్త్తు నవకంబగు తామరసంబు కేలశృం
గారవినోదలీలఁ దగఁ గంజదళాక్షునిఁ జూడవచ్చె నో
నీరదవర్ణ యిప్పు డొక నీరజపాణి వరించితే ననున్
నీరజపాణిఁ గాగ కరుణింపుము నన్ను నటన్న కైవడిన్ 67

మ॥ లవితాంఘ్రిచ్ఛవి మోవి కెంజిగి ముఖోల్లాసద్యుతుల్ గాంచి రో
వెలఁదుల్ చిల్కలు దుమ్మెదల్ పదువురై వెన్నంట రా వచ్చె నా
జలజాక్షుం గన నొక్కయంగన మనస్సంజాతుఁ డంపంగఁ త
ద్బలసంఘంబును బారఁజూపు కరణిన్ భ్ర[illegible]ంభద్గతిన్. 68

మ॥ అమితోత్సాహతి నిట్లు శౌరిఁ గని మోహావిర్భవత్సారవ
శ్యమునన్ గొందఱు సుందరీమణులు చేష్టల్ దక్కఁ దచ్చారునే
త్రము లీషన్ముకుళత్వమున్ బొరసె నా దైత్యారి దృక్చంద్రసూ
ర్యమరీచుల్ ప్రసరించు పెంపుగని తా రబ్జాక్షులౌటం బళిన్. 69

మ॥ అలివేణుల్ త్వర నీగతిన్ గనకహర్మ్యశ్రీప్రాంగణారోహలై
యలరు ల్లాజలు కుంకుమాక్షతము లుద్యల్లీలఁ బైఁ జల్లుచున్
గళ లీనం గపురంపు టారతులు ముక్తారాజి నీరాజనం
బులు దీవింపుచు నిచ్చి రచ్యుతునకున్ బుణ్యాంగనల్ పాడఁగన్. 70

శా॥ గాంగేయాంగ పతంగపుంగవ తురంగత్సంగ దుత్తుంగ భా
రంగత్ఛత్రవిచిత్రచామర సమీరప్రస్తఘర్మాంబుఁ డా
శృంగారాంగజమూర్తి తద్విభవముల్ శ్రీమించఁ గన్గొంచు సా
రంగాంకద్యుతిదీప్తమానగరు జేరం బోయి మోదంబునన్. 71

కం॥ ఖగరాజస్కంధము డిగి । నగరాజత్సౌధమండపంబులఁ దగు నా
నగరీజనమున్ సుమనో । నగరాజిరుచిరము గడచి నాతియుఁ దానున్ 72

చం॥ అమలసువర్ణదర్పణము లంబుజరాగవితానముల్ సురేం
ద్రమణికపోతపాలికలు రాజితమౌక్తికతోరణంబు లొ
ప్పె మిగులుమధ్యరంగమున బొత్తడిబొమ్మలనాట్యకేళిచేఁ
గొమరగుకొల్వుకూటమునకుం జని కంజదళాక్షుఁ డత్తఱిన్ 73

ద్విపదగర్భితసీసము.

మందారకర్పూర మహిమ చేసగడి చందనతరువాటి చందంబుదెగడి
తారతుషార సాంద్రవిభూతిఁ గాంచి సారాభగాదిచి సా రాక్రమించి
శారదాంబుద కంబు సంపద నేలి వారిదములచల్వ వారింపఁజాలి
పర్వేందుచంద్రికాపటిమఁ జెన్నొంది సర్వజ్ఞ మైచాయ సర్వంబు నొంది
చారుశోభాత్రికచ్ఛట మీరుమీర,హరిసింహాసనం బలరారఁగాంచి
వెన్నుఁడు దండువసించె వేల్పులసురలు,సన్నుతింపంగ నిశ్చలసమ్మతమున 74

గీ॥ అలరుటలరుహాసనాదుల త్తతిఁ జెంత । వరుస సురసముత్సవములఁ బూని
నిలువుగొలువు సేయ నేర్పుతో నపుడహి । శయను నయనసంజ్ఞ సైన్యవిభుఁడు 75

చం॥ గురుమృగనాభి సంకుమద కుంకుమ పంకము కట్టువర్గముల్
పరిమళవీటికల్ కనకపాత్రములందిడి తెచ్చియిచ్చి యో
సురవరులార శ్రీవరునిశోభనముల్ గన మళ్లిరావలెన్
హరిహయుఁ దాదిగా నిజగృహంబుల కేగుఁడటంచుఁ బల్కెనన్ 76

కం॥ కరుణారసపూర పయో । వరుణాలయ! చక్రి! పోయివచ్చెదమనుచున్
శరణాగతమతి శ్రీపతి । చరణాంబుజములకు సురలు సాగిలి మ్రొక్కన్ 77

సీ॥ శేవసెత్తుచుఁ గౌఁగలించె మహేంద్రుని హస్తముఁ జూచి లెమ్మనుచుఁ గిలి
నలసితంచు యథోచితాలాపముల యముఁ బోయిరమ్మని వక్కాణ్యాజనుని
సంస్మితాననబింబసంజ్ఞ చే వరుణుని సుముఖభావమునఁ గేల్ జాఁచి పవను
సముచితాలాపవీక్షణముల ధనదుని భ్రూవిలాసంబున భూతపతిని
నుల్లమలరంగఁ బంపుచు నెల్లవారిఁ । దగినతెఱంగులవీడ్కొల్పి దనుజవైరి
వేత్రధరహుంకృతులుమీరి వెడలిమీరి । శ్రీకరాభ్యంతరాగారసీమఁ జేరి. 78

కం॥ హారుమంజిముత్త్రియంబుల, నురుమంజిమఁగూర్చి వట్టి యొకగద్దియపై
గరిమం జెలఁగి వసింపుచుఁ, గర మంజలిసేయు నబ్ధిఁ గని హరి పల్కెన్॥ 79

కం॥ ధనదాలాపము వనితము, జవదాటము మేము సిద్ధసంకల్పుఁడ! యో
యవనాళికరజనక! తేఁకువ నీకేఁకేమి వలయుఁ గోరుమటన్నన్॥ 80

ఉ॥ “ఇచ్చినమాటఁ దప్పకరహిన్ గరుణింపఁగ విన్నవించెదన్
ముచ్చటయింక నొక్కటి యమోఘరతిన్ హరి! నీవు పెద్దతో
వచ్చి శుభక్రమంబున వివాహముఁ గైకొనుదాఁక వీఁకతో
నిచ్చట మద్గృహంబునను యిందిర నిల్వ ననుగ్రహింపుమా॥” 81

ఆ॥ అనుచు విన్నవింప ననుచు నెమ్మనమున గలుపకంటిఁ జూచి నలువతండ్రి
“యుచితమెంచి జలధిరచితవాక్య[illegible], కను”నటంచుఁ బ్రీతి ననుమతింప॥ 82

కం॥ గురుప్రియమును వరునయమును, బరిణయనముచితము నెంచి భావంబలరన్
సిరియును సమ్మతి సేసెను, శరధి మనోరథము లెల్లఁ జర్పింపంగన్॥ 83

వ॥ అప్పుడు,

చ॥ పగడపుసిర్కికోలలును బంగరుచట్టము జాతినీలపుం
బాగడలు వజ్రపట్టికలు ముత్తెపుఁగుచ్చులు గెంపువాతెరల్
పగటుగమించఁ గాఁ దగుటు పచ్చలపల్లకి శౌరిపంపునన్
మగువలు దేర శ్రీరమణి సాధునిఁ జూచి యథోచితంబుగాన్॥ 85

ఉ॥ ముచ్చటగా నొయారమున ముద్దులుగుల్కుచు నానతాస్యయై
యొచ్చెమొకింత లేని వినయోక్తుల “వచ్యుత! పోయివత్తున
న్నెచ్చపుగేఁజ త్రగించి సెలవి”మ్మన విష్ణుఁడు సమ్మతించెఁదా
నచ్చెలి చెల్వమొప్ప మదినచ్చిన నాత్తినపాల్కి గీల్కొనన్॥ 86

మ॥ తనునీరీతిః జతుర్భుజుండనుపఁ బద్మాకాంత శంఖాప్యనం
ఖ్యనివాదంబులు కంచుకీధ్వను లెసంగన్ బల్లకీ నెక్కి యం
గన లిర్వంకలఁ జామరంబులిడఁగా గంధర్వ మేళంబుతోఁ
జనుదెంచెన్ గురుమందిరంబునకు నుత్సాహంబు సంధిల్లఁగాన్॥ 87

తే॥ సురనదీమణియప్పుడు ఛాయసరయ కున్నసవతులును దాను సరవిఁ దా నవతులందు
మహిమలంపును సౌందర్య మహిమదనర, నెనరులేనట్టి శ్రీకాంత నెదురుకొనిరి॥ ౮౮

కం॥ పరమాణిమనుద్యోతిత, పరమౌక్తికములు పఱచి మైచమదు నెదుటన్
సిరిరాణింపఁగ వచ్చెడు, హరి రాణికి ముత్తియంపుటారతులొసఁగన్॥ 89

తే॥ పల్లకీడిగి యారమాపల్లవాంఘ్రి, దండనొక కీరవాణి కైదండఁబూన
మందహాసంబు వదనపీఠంబలర్ప, మెల్ల నేవచ్చె ననురాగ మెల్ల నిగుడ॥ ౯0

కం॥ సల్లాపంబుల సతులల, సల్లాలిత్యముల నెసఁగు సవతులలో నే
తల్లిల నీకతగు నో, తల్లీ! యని సురనదీమతల్లికి మ్రొక్కన్॥ 91

కం॥ నీతల్లిని నేనా! మతి నాతల్లివి నీవు కరుణ ననురక్షింపన్
నాతనయవైతి వోయమ్మా తనయన! నేఁడు నాదు భాగ్యము కతనన్॥ 92

మ॥ అనుచున్ గ్రక్కున వక్కువంబోదవి యత్యాపత్తి లాలించి యా
య్యని మేపావగ తత్ప్రమోదమున మిన్నందన్ సుధాంభోధియున్
దనయన్ గౌఁగిటఁ గుచ్చి యెత్తుకొని యానందాశ్రువుల్ గ్రమ్మ నా
య్యవ శుద్ధాంతముఁ జేర్చి పొంగె రమ హార్దౌచిత్యముల్ జూపఁగన్॥ 93

ఉ॥ ఈగతిమందిరంబునను నిందిరఁ జేర్చి యమందకందళ
దాగ్రముచేఁ గనత్కనకరాజివిరాజితహర్మ్యవీథులన్
సాగరరాజు గారవమునన్ బెనుపం గనుపండువై నరీ
లాగరిమంబుతో వఱల లాలనమతిమండె బాలయున్॥ 94

తే॥ ఆతనచ్చటిముచ్చట వామదృష్టి, తనయుచందము నందము తగులుపఱచి
మదికి నెక్కువ దుక్కువ కుదురుకొల్పి, గరుడవాహనుఁ డిల్వేల్పుఁగ గ్రిందుఁగాంచు॥ 95

చ॥ తగజనులెచ్చరింపను చితంబు లొకొకరీతిఁ దీర్చి యా
హాగళితధైర్యుఁడై యతిరహస్యవిశేషలిప్తవుంబుచేరి యా
దగరుసుగంధధూపములు మంచుసరాగలాపనీయముల్
నిగుడఁ దదీయ లక్ష్మీ కులశీల నెదుర్కొని యుబ్బుమెచ్చుచున్॥ 96

కం॥ వననృపతి మాధవునిఁ జూడఁ గనుచు నివాళించవైచు గమకపుజాళ్వా
పని చేయందగువనితల, యనువున నెల్లెడలఁ బండుటాకులుదుల్లెన్. 106

మ॥ చెలిమిన్ చైత్రవిభుండు రాఁగని వనశ్రీ యుత్సవారూఢి ఘూ
ర్ణిల నెక్కొల్పన పారదీపకళికాశ్రీవిభూతిన్ సము
జ్జ్వలమై లేఁజిగురాకుగుంపు తరులన్ వర్తిల్లె నగ్రంబులన్
విలసత్కజ్జలధూమమాలికలతీవిన్ దేటు లాటాడఁగన్. 107

మ॥ సురభిప్రాజ్యవనప్రదేశోర్వి నతసీనూనార్ధచంద్రాతిఖా
స్వరతోష్టాష్టమి మాధవుండు ప్రథవింపంగాంచి యత్యుత్సవాం
కురముల్ మోములనందడింప భ్రమచేగోపాంగనల్ గూడి యా
డిరిపూఁదేనెవసంతముల్ గురిపి వృష్టిం గీతముల్ పాడుచున్. 108

కం॥ వాతూగతి లతలు నృత్యము సేయ వసంతుండు మెచ్చి చిగురాకులఁ బూల్।
వేయ నవిదానుచేక్కొని కోయనువర్తించుచుఁ గూడిక్కఁ గోవెలపక్కన్। 109

చం॥ చతురసమీరకృష్ణుఁడు విశాలవనిన్ యమునాతటిన్ లతా।
వ్రతవరగోపబాలికలవ్రస్తదళాంశుకముల్ హరింపఁ దా।
ప్రతతి వినమ్రభావమునఁ బల్లవహస్తము లెత్తి మ్రొక్కుచున్।
గుతుకముమీర వేఁడుకొనెఁ గోమలకోకిలకాకలీధ్వనిన్ 110

తే॥ పుడమిఁ దమసంతతులనెల్లఁ బ్రోవఁజూచి, యలవసంతుని సురభికీర్త్యంకురములు,
భూషణములుగ శిరసునఁ బూనునోజఁ, బూచె నుద్యానవకాననభూజరాజి 111

ఉ॥ పైకములార్చి పైకొనఁగ బల్లవసంగతిచేమదించి పల్
పోకలఁ బోవుచున్ భ్రమపుష్పిణులౌ లతికూనలన్ దదుద్రే
కముఁ జూడదోషమని క్రీడను నా రహిఁ జాతికొమ్మ లా
త్మాకులమందె నట్టులె కదా? మరిసాధ్వులవర్తనంబిలన్. 112

మ॥ మధుఁడిచ్చెన్ శుకసంతతుల్ దను నుతింపన్ దొండపండ్లున్ రణ
న్మధులిట్పంచమశబ్దవంతులకుఁ బున్నాగంబులున్ బువ్వు లు
ర్వి ధరిత్రీశులయొప్పు లిట్టివెయయపాత్రేపాత్రతాబుద్ధినీయన్
బుధవాక్యంబదిదప్పరాదని తనిం జొల్పొందఁ దద్భావముల్ 113

మ॥ హరిదశ్వుండును బద్మినీప్రియుఁడు నై యారూఢమిత్రాంకవి
స్ఫురణం భానుఁడు లోకబాంధవుఁడనన్ శోభిల్లఁ గందర్పుఁడున్
హరిదశ్వుండును బద్మినీప్రియుఁడు నై యారూఢమిత్రాంకవి
స్ఫురణన్ భానుఁడు లోకబాంధవుఁడనన్ శోభిల్లెనయ్యామనిన్ 114

మ॥ మధుడన్ ప్రౌఢతరాధికారనయవిన్యాసగ్రాహితామోదవ
ర్ధిగనాళిన్ సుమనోనికుంజ నవభాండాగారముల్నింపఁ ద
న్నిధులెల్లన్ బరికించురీతి మెలఁగు న్వేమారు శ్రీఖండరా
జ్యధురీణానిలరాజమౌళి భ్రమరీసంగీతమేళంబుతోన్ 115

కం॥ ఆయామని నుపవనమున, నాయామవతీమనోవిహారుని సైదో
డాయామవినోదంబుల,నాయామని కింజరింప నత్యుత్సుకఁడై, 116

తే॥ వనలఁగొనుకోర్కి నంబుజాననలుగొలువఁగ దన యగారోపవని కబ్ధితనయ చనియెఁ
జరణమంజీరనినదసంచరణమునకు,గ[illegible]గొన హంసతతు లాడికములుసేయ, 117

కం॥ ఆరామమునకునిటుచని,యారామ చరింపఁ జెలువ లచట మరందా
సారామృతపూరామిత,సారామృతవచనరచన సంధిలఁ గమలోన్ 118

చం॥ మలయజగంధి! పాంథజనమర్దనదృప్తి మరుండు రాఁగ ద
ద్బలముల నెచ్చరించుట కుదారత నాగసరంబుఁ బట్టి పెం
పలవడఁ జూచితే తలిరుటాకుసుడిన్ వదనంబుఁ గూర్చి కో
కిలము కలస్వనంబు దులకింపఁగ గ్రోల్చు తెఱంగు లిచ్చటన్ 119

కం॥ కుందమకరందతుందిలమిళిందధ్వని పాటఁబాడ తెమనఁ దగి శ్రీ
యిందిర తనమందిరమున, కిందిరమునరాఁగ నెదురుకొనుగతిఁ గంటే 120

చం॥ నిబిడమనోజ్ఞరాగమున నిస్తులబాలరసాలపల్లవ
స్తబకము నందబోవు ఘనషట్పదమాలిక నందుఁ జూచితే
యబల! మహేంద్రదిగ్గిరితటాంతరరుక్తరుణార్కమండలీ
కబళనబుద్ధిఁ గ్రందుకొను ఘూతుకకేతువు రీతిఁ దెల్పెడిన్ 121

చం॥ అల మలయాద్రిచందనసమన్వితకృష్ణభుజంగముక్తరో
యాల సూచుతుందగంధవహుఁ డచ్చటనుండక వచ్చి యిచ్చటన్

మెలఁగుమిళిందమాలికల మెండుఁగనుంగొని తద్భయంబు లో
నలమ నదృశ్యుఁడైనగతి నల్లనవీచువిధంబుఁ జూచితే 122

చం॥ తలిరులఁ గోకిలమ్మ మధుధారలఁ దేటిఁ పరాగమున్న దా
నిలుఁదు ఫలంబులన్ జిలుక నిచ్చలు రాయిడిసేయ నానిపై
నెలకొనుకోపదృష్టిని వనీరమ నెమ్మిగ మెఱ్ఱచేసినా
బలియునశోకకింశుకజపాకుసుమద్యుతిఁగంటె నెచ్చెలీ! 123

చం॥ రణవిజయాత్మభూభటులు రచ్చలనల్పెడిగోఁ జూచి నై
రణగను బెట్లు? మారునిశరంబులనుండివి యోగిధైర్యమిం
దణువయితూలదే? సమధికాళిపికాళిశుకాళిమాలికా
రణనముఁగూడి యీవనమరాళిక రాళి విరాళిఁగొల్పఁగన్ 124

సీ॥ శుకి ప్రాణసఖుఁ బాసి వెలికుక్కునఁ జించె లలన? యీకెలనకాదళము దళము
విభుఁగానకరసి కోవెల దామెదలఁ గ్రక్కె నవల! యోయవలపల్లవము లవము
అంచ నాథునిదూఱి యలుకదుమ్ములు రేచె రామ! యీసీమ నీరజము రజము
పతితో నెడసి తేఁటి బలిమి రెక్కలదుల్పెఁ జాన! యీచానకేసరము సరము
ననుచుఁ దమలోన భ్రమలూన వినయలగుచుఁ, గలిసిగమిగూడి తమినాడి గములు సతులు
మదినుబుసుపోక రసపాకమర్మవచన,రచనఁగొని యాడవిని ప్రౌఢరమణుఁ దలఁచి

చం॥ అగణితయౌవనోదయసమంచితగానవ సంతవాసరం
బగుటయుఁ గేళికావనవిహారముఁ గాంచుటయున్ సఖీవచో
నుగతిను కాదికార్భటియునుం బరికించుచు గుండెఝల్లనన్
విగళితధైర్యయయ్యె నరవిందనిభానన కేశవస్మృతిన్ 126

కం॥ ఆ లోకజనని వనవిభ,వాలోకనజనితరాగయై కొంకఁగఁ దా,
నాలోకుపగనిరతిపతి,యాలోఁ గుతుకమున వింట నమ్మునుటించెన్ 127

మ॥ సముదంచిందరశింజినీకృతధనుష్టంకారుఁ డంభశ్చరాం
కమహావీరుఁడు కీరశారిభటహుంకారంబుమీరంగ దు
ర్దమశక్తిన్ దొరగింప నమ్ములను జంతన్ వాతపోతోద్ధతిన్
మమముల్ రాల విరాళిఁ గాంచిరమ యష్టోక ప్రకంపార్తయై 128

ఉ॥ "చుంబనరాగరక్తమధునూదనయీాలతికూనగాంచుపొం
కంబిటుకంటివే?" యనినఁ గన్గొనఁజాలక జాలికొండన
య్యంబుజపాణి కేలెత్తఁగి యందొక పాణిపయ స్యదానిరా
స్యంబునమందహాసరుచిసంఘిల మంజులరీతినిట్లను౯॥ 129

కం॥ బాలా! నీలాగేలా, గేలా డోలానుకూలహేలాలోలా,
వేలాళీలానిత్యముల, చాలా మేలాని చూడఁజాలవదేలా? 130

తే॥ నీరజావాస! నీవేణి పేరుమోచి, కాదె? షట్పదవిఖ్యాతిఁగాంచెనళులు
జననమొందినమొదలునీసదనముననె, రొత్తిపెంచినవానిపై నేటికి? కలుగ॥ 131

కం॥ శరశేఖరా! నీస్పష్టిన్, సరిపోదనవలదుభృంగసంఘముసుమన
పరిపాక మెత్తఁగిరిదగుగను, పరికింపఁగనతనుగుణ విభాసితమహిమ౯॥ 132

సీ॥ నీమోము సామ్యమందినకంజమునపల్పిచన్న నైనఁ జాల తాడనమొనర్చు
నీబాహులకుఁ బ్రతిని థులైనలతికలఁ బెనఁగొని మిగులఁగంపింపఁజేయు
నీకుచస్పర్ధిపాండిత్యంబుఁగను సుమస్తబకంబులను నీరసంబొనర్చు
నీపదంబులసాటి నిలకొను లేఁజిగురాకులదూఁటి జికాకుపఱచు
నీతనూదివ్యగంధసన్నిభము లైన-జిలుగుపుప్పొడి రెక్కలఁ జిమ్మిపైచు,
నీప్రియాళులపైనల్ల నేమికతము, కుందకోరకరదన! యోమరుంగమన 133

ఉ॥ ఇక్కడఁ దేటిబోటి హృదయేశ్వరుఁగాననిగారి నెమ్మదిక్
బొక్కుచు రెక్కల౯ గుసుమపూరపరాగమురాల్ప రేణువం
వొక్కటి నీదృగంచలమునొందెను నిందటుగాక యున్న నీ
యిక్కనుగోరగించుటకు హేతువదేమి? మదేభగామినీ! 134

ఉ॥ భూరికిరి కుంజగుంజదళిపుంజమునీాద నెకాదు నీదుకో
పారుణవీక్షణంబు లలనా! కలనాదవినోదకారి కా
కీరపికాళినీాఁదఁ దులకింపఁగసాఁగె మనః పచారమే
తీరొక? వింతనోచెను మదిక్ దిలకింపఁగ నీదుచెయ్దముల్॥ 136

ఉ॥ కైరవనేత్రి! చైత్రసహకారము కోకిలకాకలీకుహూ
కారము చిల్కపల్కుఝుడికారము నంచి లేచంచరీకఝుం

కారము కారమై స్మరవికారముఁ జూపెనొ కాక యంచితా
కార మధీశసంగమ సకారణమై కనుపించె నెంచఁగన్॥ 136

కం॥ నాతోడు నీయభీష్టము, నాతోడం దెల్పు మాత్మ నైపుణి నిపుడే
నీతోడు నిన్నుఁ గూర్తును, నీతోడు వియచ్చనాభు నీరజనాభున్॥ 137

కం॥ అని తను చెలిమిన్ బలికెడి, వనితను గనునంత వీచె వనరుహగృహవా
సినితనులతఁ గంపింపఁగ, జనితత్వర మలయశైలచలదనిలమ్మున్॥ 13౮

సీ॥ కమనీయగతి నిట్లు కమ్మని తావుల మెలయు నా చలువ తెమ్మెరలఁ జూచి
మెఱయు నా చలువ తెమ్మెరలతో నొక్కని వచ్చు పటుల తాంతపరాగపటలిఁ జూచి
పటుల తాంతపరాగపటలి వంటి స్రవించు చిక్కని పూఁదేనె చిన్కుఁ జూచి
చిక్కని పూఁదేనె చిన్కు వెన్కొని వచ్చు కుంజన్మధువ్రతకులముఁ జూచి
"ముదిత! యిది భూమ మిది నీర మిదియె తేజ, మిది సమీరణ మిన్నియు నెనయు కతన
జడియుం జలవంబు లిచ్చట నడియరాదు, చనుమను మనొక్కసంతఁ పుఁజలికెఁ జేరి॥ 139

ఉ॥ మానిని యిట్లు కేళివనమధ్యమునన్ శరదిందుచంద్రికా
శ్రీనగు గంతపుంజవికెఁ జేరి తదంతరచంద్రకాంతసం
ధానితవేదికాతలమునన్ వసియించె సువర్ణపుత్రికా
నూనకరాబ్జసంధృతసముజ్జ్వల చామరరాజి రాజిలన్। 146

మ॥ స్ఫురదప్ధాపన నేత్ర! నేత్రరుచిసంతుష్టాంబురుట్పుత్ర! ప
త్రరథేశస్తుతిపాత్ర! పాత్రభువనభ్రాజత్సుఖైమిత్ర! మి
త్రరుగంచత్కటిసూత్ర! సూత్రరచనాప్రాగల్భ్యవాగ్గోత్ర! గో
త్రరిపుశ్రీవనచైత్ర! చైత్రరథనాథత్రాణవిశ్రాణనా! 141

కం॥ ఖగరాట్తురంగ! రంగ, జ్జగదవనక్షాపసంగ! సంగతకపటా
శుగశకటభంగ! భంగ, స్థగితాంబరసింధుభయదజయపటహారదా! 162

తురంగవృత్తము.

బాలా గూహన! లీలామోహన! భద్రవినిద్ర! సముద్రనివాసా!
శైలోద్ధారణ! శిలావారణ! శౌరి! మురారి! దరారివిలాసా!
నాళీకోదర! కేళీనారద! నాదవినోద! పయోదవికాసా!
కాళీయావన! పాళీభావన! కామసుధామ! సుధామసువాసా! 143

గద్య.

ఇది శ్రీవెంకటరమణకరుణాకటాక్ష సంప్రాప్తసారస్వతవైభవ వాక్యయా
మాత్యతనూభవ రసికజనహృదయంగమ సంగీతసాహిత్యకళాధౌరంధర్య
రాయసము వేంకటపతిమంత్రివర్య ప్రణీతంబైన లక్ష్మీవిలాసం
బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



# లక్ష్మీవిలాసము.

## చతుర్థాశ్వాసము.

—:0:—

కం॥ శ్రీకర! రిపుభీకర! సుగుణాకర! వత్సాపహరణ హాసాంచిత మా
యా కలనచతురతర! రత్నాకరవినివేశ! వేంకటాఖ్యగిరీశా! 1

వ॥ అవధరింపుము తిరువాతివృత్తాంతంబు జనమేజయునకు వైశంపాయనుండిట్లనియెఁ
దదనంతరంబున 2

చం॥ పటికపుడొంకలందుమిసిపాకెడుగొజ్జఁగినీటియేటి చెం
గటఁ జలివెల్గుఱాపాడలుగట్టుపదావల ద్రాక్షతీవ పం
దిటి వలవంకకస్తురపుదిన్నెకడన్ సురపొన్నగుంపుచుం
గిట జిగిమించునట్టిచవికెన్ సిరి పంచశరార్తి వర్తిలన్ 3

సీ॥ పరికించిచూచి భ్రమన్పడియెమిక్కిలిరంభ చేష్టదక్కి వసించెఁ జిత్రరేఖ
పులకించె జలవరించుచుఁదిలోత్తమ గొంత కదుఁగాఁకఁదపియించి కరఁగెహేమ
కనుగొన వైవర్ణ్యమనుకరించెనుదార భీతిచే మిగులఁగఁపించె హరిణి
యదరించెమంచుగానశ్రులుజలరేఖ మలసెవిస్వరత నే మంజుఘోష
యతనుసాత్త్వికపరిపాక మధిగమించి,వనరుహావాసయుందు భావముగణించి
చింతఁ దారును దదవస్థఁ జెందినట్లు, విస్మయమునొంది రీరీతి విబుధసతులు 4

శా॥ శ్రీకల్యాణియవస్థఁ గాంచి యిటులం జింతించుకాంతాళితో
సాకల్యంబుగఁ దత్సఖీమణి పయోజాతాస్త్రబిభ్యన్మనో
వైకల్యంబు తెలుంగుఁ దేటపడఁగా వాక్రుచ్చి కేళీవనా
స్తోకక్రీడలఁ బ్రొద్దుపుచ్చెడనుచున్ సూచింపఁ దత్ప్రేరణన్ 5

కం॥ నలినీలాలితకరతల నలినీలాలకను బద్ధనతనుఁడు విరిగో

లలనాలికలపఙ్క్తి చూడఁగని లతానారుల మట్టివిహ్వలతఁ దొలఁగింపఁగ 6

మ॥ ఇటు పుష్పాపచయచ్ఛలంబున రమాహేమాంగికిం గొంత యూ
అటఁ గావింతమటంచు హంసగమనల్ ప్రౌఢోక్తి నొండొర్లము
చ్చటలం బిల్చుచుఁ గీల్జడల్ ముడిచి యంచల్లీలఁ జేలాంచల
చ్ఛటలెంతే బిగియించి సంఘటితభూషాభాసమానాంగులై 7

సీ॥ మోముఁ జూపవె యంచు ముచ్చట సంపంగిఁ దేటిఁ జూడవె యంచుఁ దిలకశాఖి
నగవుఁ జిల్కవె యంచు నంటి నసురపొన్న మాటలాడవె యంచు మమత గోఁగుఁ
దావి మూర్కొనవె యిత్తు జీనంచు వావిలిఁ ద్రేమఁ బాడవె యంచుఁ బ్రేంఖణంబుఁ
గేలనంటవె యంచుఁ గురవిరసాలంబుఁ గౌఁగిలింపవె యంచుఁ గడఁకఁ గొరవి
సంప్రీతుదనై నఁగూర్చవేయని యశోక, మాస్యమధురసమొసఁగవేయనుచుఁ బొగడ
యానపడకున్నె? విటపాఖ్యనలరుకతన నతివ! నినుఁ జూచి తనుఁ జూచి దైన ననుచు

కం॥ కాహాళికలగతిఁ దేంట్లుహా. శాహాళికల మ్రోయు తరువులకు సిరివొలకుం
దోహదములు కోరకసం, దోహదములుగా నొనర్చి తొయ్యాలులంతన్ 9

లయగ్రాహి

చెందొవల కందువల గ్రందుకొను కుందములు విందొసఁగు సందడిలు నందదరవింద
స్యందిరసతుందిల మిళిందకుల సుందరుల చిందులకు డెందములు కందళములంచన్
గొందలిరులొందు కురువిందవిరిబందికుల మందగొనియిందుముఖులందఱు ననందా
నందమును జెంది విరులంది చిదుమఁ దొణఁగి రంద మిరవొంద మకరందములు చిందన్

సీ॥ మగువ! తేనియల కిమ్మగు వసంతపువాఁక దిగువయాసంపెఁగల్ దిగువవలయుఁ
దెలవ! యీ గోరంట్ల తెలివుఁ గాంచి గ్రహించి బరవసంబున నందుఁ బలువవలయుఁ
జెలువ! యీ సురపొన్న చెలువమైనది దీని నిలువమావుల క్రింద నిలువవలయు
జెలఁది! లేమావి కోవెలది కొన్నెలకందువలది మాకంద మావలదివలయు
నవముగాని విమనలచే నచుచుననుచుఁ గదిసి కోరకశోభితాగముల గముల
నచటఁ గోసిరి నెత్తావినలరు నలరు లతిముదమ్మున లీలావనతులు సతులు 11

మ॥ తమకున్ గాసచ్చేరిరైన లచ్చిపయిఁ గందర్పుండు నవ్యాస్త్రజా

లములెల్లం దొఱఁగింపనంచు నవిరొల్లం గొల్లగావించు చం
దమునం బువ్వులువిల్చుచుం బటువినోదప్రౌఢిచేఁ బిల్వఁగా
రమ దానుక్ భ్రమదానులాపములఁ దత్ప్రారంభసంరంభయై॥ 12

సీ॥ బిసమాలికాసమంజస మానితస్థలాబ్జ సమాజముల నశేషంబుఁ జిదుము
ముకుళాభరణశోభివకుళాచ్ఛసూన గుచ్ఛ కుళావళుల సమస్తముఁ గ్రహించు
సుకరాలపనకీరనికరామ్రతామ్రకోరకరాశి నొడిసి సర్వస్వముఁ గొనుఁ
గలితాళిధాటి వీలులితాగ్రమల్లికా లలితాభినవ కుట్మలములఁ ద్రుంచు
రాజితశ్యామలోత్పలరాజి కెల్ల, బంచబాణుని బాణప్రపంచ మెల్లఁ
బాలయఁ జేయుటఁ బోలె నింపాలయనిల్చి, పర్వచంద్రాస్య యలరులపర్వమొసఁగ॥

కం॥ బాలికనలిబలములఁ దా, బాలికగొనసాగదనుచుఁ బనుచు సుధాంశో
హాలికలఁ గూడి విధుశా, బాలిక గావించుఁ గుసుమహరణస్ఫురణన్॥ 14

సీ॥ నానలశోభనలీలమసలఁ బాటలవర్ణకేసరాక్షతపాళిఁ గీలుకొల్పి
పాసఁగ షట్పదగానమొసఁగఁ బైనుడివోసి నలితావుసుంకు లింపాలయఁ జెరిగి
తనువు నూతనకాంతినవుఁ జొప్పడ సారె జిలుగుబుప్పొడుల వల్లులు ఘటించి
కురులఁ మిక్కిలి తేట సిరులు దేరఁగ దేనెసంపంగినూనె మస్తమునఁ జిలికి
బాలకళ్యాణసూచకం బావహిల్ల, నలరుపొదరిండ్లలతసూన ననగిపెనఁగి
పెండ్లికూఁతురుఁ జేసిన పెంపుదోఁప, బాల తత్సమయోచితశ్రీలఁ దేలి॥ 15

సీ॥ “పత్రశృంగారసంపదనొసంగిన నీకుఁ బత్రభంగ మొనర్చు పనులవేల ?
ఫలపాకసౌభాగ్యపటిమ గాంచిన నీకు ఫలవిఘాత మొనర్చు పంతమేల ?
సుమనఃప్రసాదనిస్తులతవర్తిలు నీకు సుమనశ్ఛిద మొనర్చు తమకమేల ?
రసపోషణవిలాస రతి నెసంగిన నీకు రసచాలన మొనర్చు రవ్వయేల ?
యో చిగురుబోణి! యోదాడిమోపమకుచ! యోకుసుమగంధి యోమధురోష్ఠి! దీనఁ
బికశుకవసంతమధుప సంప్రీతి యగునె? చాలు వనకేళి” యని ప్రాణసఖులు దెలుప॥

కం॥ బింబాధరి ప్వామలముఖ, బింబాధరితాబ్జయై కృపీటక్రీడా
డంబరగతి శంబరజక, దంబగతిం బరఁగు సరసినరసి రసోక్తిన్॥ 16

తే॥ సరసిజలతాంతమధ్య లెచ్చరికఁ దెలుప, సరసిజలదేవతను మ్రొక్కి చారుసరణి

వనతటానకగాత్రియై వారిదహాభ, వనతటాన మెఱుంగుపావడ ధరించి 18

కం॥ చక్కని చెలులుం దానును, రిక్కలగమిఁ గూడివచ్చు రేరాకశశినా
నక్కొలికి కొలఁకుఁ జొచ్చెను, జక్కవకవ బెదర నీరజంబులు చెదరన్॥ 19

ఉ॥ చంచలలోచనల్ సరభసంబున నిట్లు కొలంకుఁ జొచ్చి కా
ఖించుపయోవిహారముల వేఁగునకోఁగరాక తత్తనూ
కాంచనవల్లికాప్రభలు గాంచితలౌకెడులీల సేచె ఝు
మ్మంచు నుదంచితాంబుజ దళాంచలచంచలచంచరీకముల్॥ 20

చ॥ ఘనతిమిరాసితాలకయొకర్తు సమీకరణభ్రి మొగ్గతిన్
వనజరసస్థితుల్ చెదర వారివిహారమొనర్చె యాననమో
హనకుచకుంభసామ్యదురహంకృతిమగ్నఁగహంసచక్రిముల్
కనుగొనుమాత్రనే కడుఁబకాబకలై చనఁ గొప్పదిప్పచున్॥ 21

చ॥ ఒకతిమిరోపమానకచ యొక్కరథాంగకుచన్ సరస్థ్సలిన్
గఁ వికచేయ నిర్వ్యరనుగాసిలఁజేసెఁ గళాధరాస్య వే
ఱొకతెకకప్రచారమున నోలయటన్న మహోత్పలాక్షు లం
దుకు నుది ఖేదమోదములఁ దూలిరి కొందఱు సందడింపఁగన్॥ 22

చ॥ "కువలయితాస్య! యంబుధరకుంతల! చంపకనాస! చంద్రికా
ధవళిమహాస! నీవదనదర్పనమాత్రనె తల్లడించె నీ
యవిరళచక్రహంసమధుపాబ్జము,, లంచు నెపంబుచేసి ప్రా
భవమున ముంచె నొర్తు నొకభామ సరోవరసీమ నీఁదుచున్

శా॥ ప్రాజ్యాలంకృతిఁ గేల నబ్జములు మీరన్ నీటఁ బద్మానన
ప్రజ్యప్రాభిమ నిందిరం గదిసి శ్రీవల్లీనతైయీఁదుచున్
సద్యోతిమ్మతులై కనందగిరి తత్సారూప్యసామీప్యసా
యుజ్యంబుల్గనులీలఁ గొందఱు వధూవ్యూహల్ సరఃక్రీడలన్ 24

వ॥ ఇత్తెఱంగున నుత్తుంగ రథాంగ చక్రాంగ సారంగ తరంగితంబగు సరోవధ్యరంగంబునం గురంగేక్షణలం గూడి జలకేలినోలలాడి కలిమిపూఁబోఁడి యలరఁగూడి యున్నయెడ. 25

మ॥ శకునిప్రస్తుతధార్తరాష్ట్రవరదుష్పాండిత్యఘోషంబు ద
ర్పకదుశ్శాసనయుక్తిమై నెసఁగఁ గర్ణక్రూరభావాప్తిచే
నకటా! దుష్టచతుష్టయాధిగత మాయాక్షాకరం బన్న నా
త్మకళంకన్ నవలా కొలంకు వెడలెన్ మత్తేభకుంభస్థలిన్. 26

మ॥ ఒకకైయోరగఁ దత్తటిన్ నిలిచి నీరొప్పారఁగా జాఱఁ గ్రా
శిక మొయ్యొయ్యనఁ జేతులం బిడుచుచుం జేపావడన్ పట్పదా
లక నెమ్మో తడియొత్తి గుప్పటపుఁ జేలం గట్టి చూపట్టెఁ జాం
ద్రికనీహారపరీతకాంచనలతాధిక్యన్మనోజ్ఞాకృతిన్. 27

మ॥ కొనగోళ్లం దొగకంటి వెంద్రుకలు చిక్కుల్ దీసి సాంబ్రాణివా
సనహత్తించి జవాదిలేఁబదును మించం జిల్కు దంతంపుదు
వ్వెనచే దువ్వుచుఁ గొప్పుఁదీర్చె నొకతన్వీరత్న మాయత్నముల్
గనిమారుండును గొప్పుఁదీర్చె మెఱుఁగొక్కన్ జివ్వి క్రొవ్వింటికిన్. 28

ఉ॥ మొల్లలు చుట్టి ముత్తెఱఁగు ముత్తెపుసొమ్ములు వెట్టి నెమ్మోయిన్
జల్లని కప్పురంబలఁది చందనపుందిలకంబుఁ గూర్చి కం
జిల్లఁగ నింతులెల్లఁ గయిసేసిరి యాసిరి నా శిరీషసం
ఫుల్లసుమాంగి నా సుదృగపూర్వపురంగిఁ నభంగిఁ బ్రేమమై. 29

ఆ॥ సిరికి నపుడు గూర్చు శృంగారమంతయుఁ । జిత్తజాతతప్తచిత్తగాన
శీతలోపచారరీతిదోఁచియు(తాంత)శీతలోపచారరీతి దోఁచె. 30

మ॥ చెలులుం జిత్రముగా యథోచితగతిన్ శృంగారముం బూని శ్రీ
వలనున్నంత సువారవుంబనుల చెల్వాల్ బోనఁగావళ్లతో
లలితేష్టాన్నపదార్థముల్ గొనుచు రా లక్ష్మీసతిం గూడి యా
కలకంఠుల్ వనభోజనంబుల చటన్ గావించి రిచ్ఛాగతిన్. 31

కం॥ బలిమినిటువలయుమాత్రము । కలిమిపొలఁతి యారగించి కమలోపవనిన్
జెలివనటవిశ్రమించుట । కలమిథునాంచిత లతాగృహమున వసింపన్. 32

మ॥ వలువొాందం(దొాలుదీవి) ప్రామినుకుమిన్నల్ పూని రశ్మిచ్ఛటల్

మలయం గాలని వే ద్యసూరుకరలీలానీఁకుమానాళుగో
జ్వలవేగంబున ఘోరపుష్కరవరాధ్వగ్రాహితం బశ్చిమా
చలతీరంబునకుం డిగెం దరణి వేశ్యాస్వాంతముల్ రంజిలన్. 33

తే॥ పద్మయ త్తితి విరహతాపమునఁ బొగులఁ। దన్నివాసములగుటఁ బద్మములునొగిలెఁ
దానుబద్మాప్తుఁడగుటఁ ద త్తన్మనోర్తి। నోర్వ కరిగినగతి మిత్రుఁ డుదధిఁ గ్రుంకె.

మ॥ బలవ ద్దినక్షయాగత విపద్దశచే హితచక్రదైన్య మ
గ్గలమగుచో గళద్భ్రమరకచ్ఛటతో శతధా సహస్రధా
దళనమునొందు డెందములఁ దల్లడమందుచు సొమ్మసిల్లునో
జలఁ దగెఁ బద్మినుల్ ముఖవిషణ్ణత నందముఁగుందుచందముల్ 35

మ॥ నగకోదండధరుండు తాండవ మఖండన్మండలావృత్తిస
ల్పఁగఁ జేతప్పి సముద్ధతిన్ బడినజాళ్వాధక్కనాఁ గ్రుంకె నా
తుగతిన్ భానుఁడు తద్వికీర్ణ మణిరజ్జుచ్ఛాయనా సంజకెం
జిగిమెంచెన్ దదనుస్వరంబులన మించెం జక్రదైన్యధ్వనుల్ 36

చం॥ రయమునవిల్వఁ దావులయి రాజిలుతమ్ములు సొమ్మసిల్లుటన్
బయినవలంబనంబగుచు భాపిలుమిత్రకరాళి పట్టుశే
మియుఁగని యేకకాలమున మెట్టినకొమ్మయుఁ బట్టియున్నకొ
మ్మయు విఱుగం దిగుల్పడినమాడ్కిఁ గకావికలయ్యెఁ జక్రముల్. 37

సీ॥ తపనుడప్పవసేయఁ దద్వసుగ్రహణార్థ మటుదోఁచు చటులార్భటార్చియనఁగ
నర్కుండువిష్ణుఁడై యరుగుతోడనఁజను పతిగశేఖరు గరుత్ప్రతతియనఁగ
లోకబంధునకు రత్నాకరుండేమరేగి బడిసిపైచిన మణిప్రరుచియనఁగ
నినునిరాకకు దిగంగన పొంగ వెలిఁ జిమ్ము తదనురాగరసాంబుధారయనఁగఁ
(దరుణతారాలికన్యా)నుసరణకరణ। సమయకాముకసముచితక్రమవిరచిత
జవమన్యప్రీతసపదిసాక్షాత్కృతారు। ణావయవదివ్యశోత్రినా నలరెసంధ్య. 38

చం॥ కనదినమండలంపుఁ బెరఁ గాలవులిందుఁడు గ్రుంకు మెట్టితా
పెనుచతినుర్లదొబ్బ నట బెట్టుగఁ జెందినతేనెచాలునాఁ
దనరెడుసంజ పైఁబరఁగుతన్మధుమక్షికలట్లు పైకొనెన్

మునిముని యుర్వువాని మొనముక్కులుసోఁకఁజలించెఁ జక్రముల్. 39

తే॥ భానుబింబంబుపోలు పెందుఁగానకునికి । జనులఁ దమతండ్రియొచటికిఁ జనియెననుచు
నడుగుటకు జాడఁబడివచ్చుయమునయనఁగఁ । గలయఁబర్వెనుజీఁకటికప్పుదిశల. 40

ఉ॥ మారునిమాయపంపు దినమానముమేల్ నడలింపు జారిణీ
జారులకున్ గరింపు జలజంబులకుందలవంపు కోకసం
సారముమట్టగింపు నెలబాలునిరాకకుమోముసొంపు శృం
గారరసంబుముంపు కనఁగాఁదగెఁజీఁకటిగుంపు పెంపుగన్. 41

ఉ॥ ఆంచితరాగవీథి సముదంచ్చలవైశ్యుఁడు బచ్చుగత్తగా
వించి దిగంతసీమలకు వేమఱుఁబంపఁగఁ డంకసాలవే
యించినవెండికానులపు డెన్నికఁదాఁకుటకై వెసం బచా
రించినరీతిఁదోఁచె విపరింపఁగ నత్తఱిఁ దారకావళుల్. 42

కం॥ పాటల మాటల నచ్చెరు । పాటుల శచిగూర్పఁ బొగడుపని కెత్తిన పా
క్పాటలగంధికరంబనఁ । బాటలపటుకాంతియంతఁ బ్రాచిందోఁచెన్. 43

చం॥ ఇలఁదనచేతిరత్నమిపు డెవ్వరొ దొంగిలిరంచుఁ గాలమన్
తలవరిపట్టి పల్కులకు దార్పుచు వెన్కను నభ్రవర్త్మకుం
డలవడఁ గేడిగట్టుటకునై యతఁడెత్తినవత్తి కెంపుటాఁ
బలుకయనం జనించె శశిప్రాగ్దిశనూహితలోహితద్యుతిన్. 44

తే॥ సరసుఁడీశానుఁడొనరించుసాంధ్యనటన । మరుమగా మెచ్చి పేరైనబిరుదొసంగు
కుధరమదభేదియెత్తినక్రొమ్మెఱుంగు । పసిఁడియందెన నిందుబింబంబుదోఁచె. 45

మ॥ సముదోద్రేకతఁ గొమ్ముగ్రుద్దుకొనుచుం జౌదంతిపైల్ చిమ్మను
త్క్రమవేగంబుననూడియుర్విఁబడు తద్దంతాగ్రమాణిక్యమం
జిమలీలావలయంబనంగ నుదయించెం జంద్రుఁ డవ్వ్యక్తరా
గముతో మధ్యబిలంబుపోల్కిన పుడంకశ్రీ సళంకం దగన్. 66

మ॥ కళలంగాలవుబభ్రురాజివనురేఖల్ నీటువెట్టంగ మం
జులకాంతిందగుకేసరంపునునుమచ్చల్ తేటమైనంపుటుం.

డలు తత్పటురుచిచ్ఛటామలినవర్ణతర్కుటికాశాణముల్
గలచెంగల్వలకట్టె చంచులవలీలన్ విశ్చెఁ దత్సన్నిధిన్. 47

మ॥ సుముఖుండై శశి చూడ జూడ నరుణాంశుల్ వీడి శుభ్రప్రభల్
సముదారస్థితినిండఁ గాండఘటచంచచ్చంద్రికాత్రప్రపూ
రమునందేలెడు వెన్నముద్దకరణిన్ రాణించెఁ దారాసమూ
హములాకీర్ణతదీయబిందుసముదాయశ్రీలఁ జెల్వొందఁ గాన్. 48

చం॥ సమయపుదండుగీడు వినుజాడను జీఁకటి పేరికామినిన్
దమిదహించి చక్రజనతాభయదోద్ధతిజాజువాలు న
శ్రీమగతిఁగొన్నముత్తియపుజాజరబుట్టియనంగఁ జంద్రుఁ డం
దముఁగనెఁ దద్వికీర్ణభసితంబన నిండెవిపాండుచంద్రికల్. 40

మ॥ సిరిమించన్ నెలవెండిజాతున కవిచ్ఛిన్నఁబుత్రై డిగ్గి త
త్కరజాలంబను (సో స్త్రి) లుత్పలరసైకస్వాదుసద్యోఘృతో
త్కరధారంబొదలింపుచుం బయిసముద్యత్త్రద్రజశ్శర్కరల్
దొరుగంజేసి చకోరపాళికులు విందుల్ వెట్టి రొండొర్లకున్. 50

చం॥ నిగుడశశాంకశాతకరనిష్ఠురఘాతకుఁ గాక కాకని
క్కఁగఁగ వజక్కవల్ నికటకంజనికుంజముఖంబు దూఱఁ గా
మొగములదైన్యముల్ దొలకమోఁయుచుబోవఁగ సాఁగ రాజుగో
ట్టఁగమొగసాలకున్ మొఱయిడంజనువీఁకను శోకమందుచున్. 51

కం॥ అకొన్న సురలు చంద్రుని । నీకళలందటికి సరివి నీవిడకున్నన్
బైకొదవవచ్చు నీకని । చేకొని తరివాడి చినట్లు చిహ్నంబమరెన్. 52

తే॥ కమలగర్భుండు సృజియించుకాలమునను । కలవితనియందు షోడశకళలటంచు
శాసవాదులు దెలియవిలాసమిడిన । బొంకమునఁ బంకజారిపై నంకమెసఁగె. 53

చం॥ నెలయను పానపట్టమున నిల్చిననిశ్చలనీలలాంఛనో
జ్జ్వలశివలింగమున్ సమయశైవుఁడుగాంచి సుధాభిషేకమిం
పొలయఁగఁజేయ నిర్మలపయోరసముల్ తనుసోమసూత్రధా
రల స్రవించెనోయనఁ దొఱంగె హిమాంబుకణంబులత్తఱిన్. 54

తే॥ అంబుజారాతి విష్ణుపథంబునందుఁ, దన్మహాంగుష్టనఖము నదనరెనచట
జననమందిన సురనదిఘురమనంగఁ, బండువెన్నెలదిశలెల్లఁ బ్రతిఘటించె. 55

సీ॥ అజునాజ్ఞ గడపరాదని కాని చక్రవాళాద్రిబాహ్యతమంబునణఁపలేద ?
తగదధోభువనపాతనవృత్తియని కాని బలిసద్మతిమిరంబుఁ బఱపలేద ?
దేవహూతవిపక్షతెలియనేలని కాని గిరిగుహాధ్వాంతంబుగెలుపలేద ?
ద్విజవాసశోభనావిహృతికాదని కాని చెట్లచాయలయిరుల్ చెఱపలేద ?
యనఁ జుజను లెన్నఁ గర్పూరకనదుదార, కల్పతరుతార ఘనహీర కలితహార
కనునతారకళాధార కాంతిపూర, కౌముదీధార జగమెల్లఁ గప్పికొనియె. 56

వ॥ మఱియునది విరాజద్ద్విజరాజతినూజకావునఁ బావనమూర్గంబున సుత్తమం బై పుష్పవతులై నలతకూనలు పెనఁగొనియుండుచాయలఁ బాయగిలనడచుచు వరవర్ణిని గావునఁ దనుఁజూచి మధుపపరిభుక్తలగుపద్మినుల్లు ముద్రితవదనలైతెలలుఁవంచుకొన సంచరించుచు మేనమామకూఁతురనితనుఁబర్పిగహింపనిరీక్షించుచునిత్యుధన్విన న్వేషించుపాంకమున వికంపమానయై స్తనచక్రయు వికసితచకోరనయనయు విశదాంశుకాధృతయు విస్ఫుటకుముదామోదయునై నగంబులునగంబులు నదీనదంబులు నళినాకరంబులు నానాదిగంతంబులు గలయమెలఁగునలయికనలముకొన్నక్రమాంబుకణంబులు చెందెనోయన హిమాంబులవంబులనుగురియగుఱియగువారలెదురొక్కనిసంభ్రమంబునందొరయ దొరయ నిచందాన నిరులుయథాయథలై పొలియఁబొలయలుక దేఱికామినీకాముకులు వెలయవెలయదుగువిటులతో విటీతలినూఱుమలయ మలయపవనోచ్ఛలితాచ్ఛాదనచ్ఛదనలై మదనకదనానంతరమున లతాంతశయ్యనొయ్యననిద్రించు నించుబోణుల మొగంబులుతొంగి తొంగిచూచి గిలిగింతలురేచి మేలుకొనఁజేసి తదీయమదనహాసకందళంబుల నందగింపుచు సంకేతనికేతన నూతనమకరకేతన శాస్త్రచింతనప్రచింతనా పరులగువారలకు నఖండజ్యోతియైగాంధర్వవిద్యతోఁజనుదెంచుకమలాసనురాణివాసంబురాణనేణాంకపాషాణశ్రేణులఁగరగించి జాలుకొనఁజూచుచుఁ దనయెడనవ్యాలోకనంబులఁ దమోగుణంబువారించి సారూప్యంబొసంగఁ బ్రసన్నయైన సత్వగుణాఢ్రి దేవతయన సకలప్రపంచంబును నిజకళాపరిచ్ఛన్నంబుగాసంఘటించి సరసకావ్యసారరుచిగ్రహణక్తియు సారస్వతవిశదవర్ణనిర్ణీతప్రక్రియానురక్తియు సాధుశరధరభావవివేచనాసక్తియు సముచితప్రభాకరమార్గమాననీయయుక్తియునభివ్యక్తంబుగాఁజేయుచుఁబూర్వపక్షసిద్ధాంతస్థాపనవిలసనంబుకలిమిని సమర్థించి నిర్నిద్రప్రభావాప్తిచే సుమనోవిలాసినియనమించి

ఘనసారపరిఖ్యాతినిగుడఁ గాముదగంధక్రమనీహారశైత్యంబులతోఁ గమలజాండంబుఁ గర్పూరకరండంబుఁగావింపుచు నింపొందు నిస్తంద్రరాకాచంద్రచంద్రిక విజృంభించు నవసరంబుననంబుజాలయనికుంజమధ్య మానియుండి పవమానతిరుమానలతావితానాంత రజాలకంబుల నాజాబిల్లి వెలుంగుదూఱి నిజాంగంబులదారిచురుచురుక్కున గారింప సైరింపక చిగురుకటారివీరునిబారింబడి బడిబడినివిధిందూఱుచు నెచ్చెలితోనిట్లనియె. 57

ఉ॥ "అన్ననముంచరేయిఁబగలాపగలాయెఁ బగాయె వెన్నెలల్
కన్నియ ! యేమియుఁ దవిపుగా యవుగా నవుగాదనీకు నీ
కన్నులయాన చంద్రుడుడు కాదుడు కావిడు కాలమెట్టిదో
వెన్నకుఁబండ్లువచ్చెఁగడవే పడవే యదవేగనింటికిన్,, 58

వ॥ అని విరహవేదనాదోధూయమానమానసయై పురోభాగంబున.

మ॥ ఎలఁదేఁటింగదిమించు మించుఁగనుదోయింబాష్పముల్గూర్చుఁ గూ
ర్పులతాంగిన్ విడనాడు నాడుశుకశారుల్ చేరిరానల్గు న
ల్గులుగాపూలనివేగు వేగుటకుదిక్కుల్ చూచు వేసూఱు మా
రు లకోరీలకుఁగాక కాఁక సతియూహూఢిం బతిం దూఱుచున్. 59

వ॥ ఇత్తెఱంగున నురంగేక్షణ లతాగృహంబుదొరంగి వెడలఁగందుచుఁ గురంగట

కం॥ చూతమెటఁజాతమనుచున్, శ్రీతరుణి తదీయవేదిఁజేరి మనోభూ
శాతాశుగశాతాశుగ, జాతాశుగళద్ధృతి వ్యసనయై కనలన్ 61
కం॥ కాంత గలిమాని యిటు శశి, కాంతతలంబూని కదువగంబొగుల నిశా
కాంతమదనానిలాదులఁ గాంత లుపాలంభనంబు గానని రలుకన్. 62
మ॥ "బుధులెన్నన్ భువనాధినాయకునకుం బుత్రుండవై హైమవ
ద్గధురాలోకమునంతసిల్లగ నుదారత్వంబుతో సత్కళా
నిధినామించి యనంతరాజ్యపదవిం దీండ్రించునీకేల యీ
శిథిలీభూతహృషీకపాంథమథనోత్సేకంబు రాకాశశీ!. 63

కం॥ ఇరులో తామరవిరులో, యరులో నెఱిఁగురులు కన్నులంగనచన్నుల్
సిరులుపురివీడవాడన్, బరితాపముగూడఁ జూడఁబాడిరియె ? చంద్రా ! 64

సీ॥ కలితపతంగమండలనిపానతహేతు వరయనీరాక మిత్రోపకారి !
వర్ణితామోదభాస్వరవాసవాశానిరోధి నీచూపు దోషాధికారి!
పథికమనోభయాస్పదమహాబిలవిలక్ష్యంబు నీదగుపొల్పు చక్రవైరి !
జనితదుర్మార్గలక్షణనిస్ఫుటంబు నీవృత్తంబు సజ్జనశ్రీవిదారి !
యాహా నీకృత్య మేమనవలవి లుబ్ధకుఁడవో? బాహ్యాత్ముఁడవో? రక్కసుఁడవో? కలివో?
కాకయుండిననొంతు వేకోకకుచలఁ? గనికరము లేకమీరి రాకావిహారి ! 65

మ॥ గరిమన్ శుభ్రవిభూతి మేన నెద లింగంబొప్ప శైవస్థితిన్
గరమారాధ్యుఁడనంచు శీలముపొసంగన్ విప్రయోగివ్రజో
త్తరవైరస్యము కృష్ణపక్షవిముఖత్వం బంది యోచంద్ర! పెం
పరఁ బాషండుఁడవైననిన్ను ద్విజరాజన్నన్ జనుల్ నవ్వరే ?,, 66

కం॥ అని కైరవహితుదూఱుచు, నని కైరవళిం గడంగు నతనుశరము లా
య్యానవాతఘాతచూత, ద్రునవకలిక లు[illegible] శుకరఘునినని రలుకన్. 67

కం॥ ••కమ్మని తేనెలుజడిగొన, నమ్మలనిటునింతురయ్య యజ్ఞాలయుపై ?
నమ్మనుబట్టివసంతముఁ, జిమ్మదమనుపలుకు నిజముచేసి మనోజా !. 68

కం॥ నలపులహారిదూఱఁగఁగన, వలపులసిరి నేచె దక్కటకట ! కటికివై
చెలితనయుఁడవగునిన్నీ, చెలితనయుఁడవనుచు నమ్మఁజెల్లు నెమదనా! 69

చ॥ అరయ విషంబులోదివిరి యశ్రమతన్ విషరాశిపట్టియై
మెఱసివిషంబునంబొదలు మీనమృగాంకసరోరుహావళిన్
గరిమ ధ్వజంబుగా సఖునిఁగా శతకోటిగఁ బూన నంగజా!
సిరివలనొప్పనో ఘనరుచిన్ మనునో రహిమించునో తమిన్. 70

కం॥ అరదములయ్యనుమత్త, ద్విరదములగుకీరముల గవింతురె చెలిపై
డరడగతినీకు నీకుం, దరద మతిన్ వెఱతునే ననంగ వనంగా! 71

కం॥ రేఱాఁగతనమునను వద, రేరాఁజిల్కలను సైతురే రాజముఖుల్ ?
రేలాపాడపునఁ గన్నీ, రేరా యనుమాత నేతురేరా? మారా! 72

మ॥ అనుకూలించిననీయనంగతను దేహత్యాగముంజేయుమి
త్రునిబాటించి యరూపకంబయిన తేరుంబూని పంచత్వమం
దినయమ్మ్మల్గొని నీవుభీమహనోద్వృత్తిం దిరుగం జగ
జ్జనకుం డెట్లొనఁగూర్చెనీకుఁ దగునీసామ్రగి చేతోభవా ! 73

చ॥ కుచములనీధ్వజాంకములు కొప్పవనీశరముల్ ధరించి ని
న్నచలజగొల్వఁగా నవినయస్థితి నేచి తుదం దదీశుచే
రుచివిభవంబుగోల్పడియుఁ గ్రూరతమాన వనంగ ! నీకిదే
యుచితము దండసాధ్యుఁడ వయో! గుణసాధ్యుఁడవై ప్రియోక్తులన్„ 74

కం॥ అనిమారుదూఱు సమయం, బున గమ్మనవీచువాతపోతములఁగనుం
గొని శుకపికమధుకరముల, మునుకొనియిట్లనిరి యుల్లములఁ దల్లడిలన్. 75

చ॥ “హరునిటలాగ్నిచే వెతల కాలయమైలయపైన మైత్రిమై
సిరిచెడియున్నయమ్మరుఁడు చిన్నెలనన్నెలతో లతోత్సవ
స్ఫురితువసంతుఁజేగఁ జెలి పూపొదలం బొదలం దలంకె నీ
చురుకుఁదనంబుమాని దయజూపవనాపవనావనావనిన్ 76

కం॥ శుకమా ! ముఖరుచిజితకిం, శుకమా! సుకుమారదేహశోభితదుఃఖ్యాం
శుకమా! రకమేలరతీ, శుకుమాయిచ్చినహాయము వసూయగనకుమా. 77

చ॥ కొలకొలమంచుఁగోపురపుఁ గోవెలకేళ్ళివలనీవలావలన్
గలకలరేఁచఁజూచి పయికావలిగాఁజలిగాలివాల్లితో
య్యాలివలయించెఁజిల్కలగయాళివిగాకవనాళినీవునున్
వలవలమన్వళావళినవాళిదువాళిగ మేళవింతురే. 78

ఉ॥ లేమభవన్మృదూక్తినడలీబడలీనడలీకుతూహలం
బామనితీపులోనిపికమా శుకమా మొకమాటలేకయు
య్యో! మృదువాణినేచచలమో ఫలమో బలమో గణింపరే
కాముని యానమీకు నెనగా ననఁగా వినఁగానమెచ్చటన్. 79

క॥ కాదనక వేగవేగఁగ । రాదా నీవైనఁ గాని? రాకారజనీ
పాదేల? రాజావలచిన । దే దేవ్వలసానియనఁగఁ దెలియమెనినుక్”

క॥ అనిమాటే దూతితామో । వనిరతిచేఁ దాకి దాకితమనోరథలై
వనరు వనరుహావళాక్షులఁ । గనుఁగొని కనుఁగొవలనీరు గమ్మఁగ సిరియుక్ 81

మ॥ అనుపమ కీర్తిజాలము వైనపసాంద్రహిమాంబుఁ పైకొనక్
వనిపడి వెచ్చనూర్పు మను బాష్పములొల్కఁగ “గాలివానవ
చ్చెనఁగతమానె” నన్నటులఁ జేష్టలునక్కఁ బయోధిరాజపు
త్రిని నుచితోపచారములఁ దేర్చుచు నెచ్చెలిపల్కె నేర్పునక్ 82

తే॥ “నెఱకవిల్లుండఁ జిలుకలుచిదిమివైచు । నళులఁ నిస్సార మొనరించు నలరువిల్లఁ
జిగురువిలుపూనఁ గోవెలల్ చిదిమిపెట్టు । మదనుఁడేరీతి ధన్వియౌ మంతు కెక్కఁ

వ. అదియునుంగాక 84

చం॥ కలికి! జవాజవానలగాలికిఁ జిల్కయుఁ జిల్కబోద వె
న్నెలముగిరం వరామనఁ బికంబు పికంబుఁ గుహూయునక్ విధుం
డలవిధుఁగాంచి తమ్ములలయక్ సొలయక్ రహింపకుండ నె
న్నెలమికసుక్ పరుండు భయమేటికి మాటికి నీకు చెలీ!” 8

మ॥ అనుచుక్ నేర్పునసేదదేర్చి “నరిత్రాణ్యోఁగదా యొంటినీ
వనిమందు యుంగ” యంచు నిందరనిజావాసంబునంజేర్చి “నే
నానఁగూర్తుక్ భవదీప్సితం” బనుచు నుద్యోగించి యయ్యబ్జగే
హిని హస్తార్పితకంజముంగొని వడిక్ హేమాంబరుంజేరఁగక్ 8

వ॥ ఇట్లుచను దెంచిన 8

సీ॥ లోకశాసన పాక పాకశాసనలోక భూజభోజననిష్కుటాజిరములు
హైమసంగత ధామ ధామసంగత హైమ దిశిలోజ్జ్వలకేళికాగృహములు
చిత్రజాలకపాత్ర పాత్రజాలకచిత్ర మణివితానస్థాన మంటపములు
రాగసారసమాగ మాగసారసమాగ సంతానకాంత సౌధాంతరములు
కలయఁబరికింపుమను గొంచకలయసురభి । మలయపవనప్రరోహముల్ మలయరఁ
వలయవేదిని మేదినీవలయభర్త । యలయఁ దనుతాపత ప్తుఁడై యలయఁ గని మె

ఉ॥ కని నేరఁజనవసరంబున జిత్రగతసింధుసుతవిరహాతాపంబున నతండుదనలోన

మ॥ శితబుతువెన్నం గుసుమాకరద్యుతి ముఖశ్రీఁజూడఁ జంద్రోదయ
స్థితి గెమ్మోవినెనంగురంగుదలఁపం జింతామణిన్స్ఫూర్తి "యో
సతి! ప్రాణేశ్వరి!" యంచుభావనలనిచ్చల్ తద్రుచింజొక్కి "యే
గతియో యంగజతాపమింక"నని కాఁకంజెందె శ్రీకామియున్ 90

చం॥ కలువలకోనివేఁడికిని గంతునిదాడికిఁ బూవుటంపగో
లల బలువాఁడికిన్ ధృతిగలంగ మదిందిగవాడి దేహమ
గ్గలముగవాడి సోలుతటి గ్రమ్మిన నెచ్చెలి నేతి తమ్మిపూ
వలపులదెమ్మెరం జలదవర్ణుఁడు గ్రక్కున సేదదేఱుచున్ 91

ఉ॥ "ప్రాణసమానమాగమమహోహసనూచకమయ్యెనీజగ
త్త్రాణవిహార" మంచుమదిఁ బట్టగరానిముదంబునందుచో
శ్రీనలినాయతాక్షి చెలి "సేమముకల్గుతనీకు నంబురు
ట్పాణివయస్య నీప్సితశుభంబొనఁగూర్తు"నటంచుఁదెల్పుచున్ 92

కం॥ హెచ్చినప్రియమున సిరిచేఁ । దెచ్చిన నెత్తమ్మిమొసఁగి "దేవా! నీపై
నచ్చినసతి పైకానుక! । నిచ్చిన" దనివిస్మయింప నింపునహరియున్ 93

చం॥ శయమున నాకుశేశయము సంభ్రమలీలగ్రహించి మొక్కుచున్
నయనము లంబుజాంతగమునం దగనొత్తుచు నుత్సవాబ్ధి వి
స్మయమునదోలలాడుచు రమాపరిరంభసుఖైకసాత్త్వికో
దయమునఁదేలిన ట్లురి దైవశిఖామణి పల్కెఁ గూరిమిన్ 94

మ॥ "వనమధ్యంబునఁ జిత్రపత్రరుచులన్ వర్తిల్లి సూర్యావలో
కనముంజేయుచు సాధుమాధుకగలోకంబెన్న సంస్కారవా
సనప్రాపించిన మానసప్రియవిరాజద్యోగనిష్ఠంగదా
యనఘశ్రీకరయుక్తవైభవము నీ కబ్బించె నబ్జోత్తమా! 95

శా॥ ఆలేఖ్యాకృతి కారమాసతికి నుద్యత్పాదపీఠంబవై
కేళీగేహమవై కళాభరణమై క్రీడావతంసంబవై
లాలిత్యంబునమించు నీసరసలీలన్ సౌకుమార్యస్థితుల్
సౌలభ్యంబు గణింపశక్యమె? సరోజాతాన్వయగ్రామణీ! 96

కం॥ తలఁచిన నడుకేరైయినన్ । దళములుగూర్చుకొని కుసుమధన్వికి జయమున్
వెలయింతువు కాంతస్థితి । నలరుచుదయఁ దొలఁగ నీరజాన్వయతిలకా 97

మ॥ ఆజానింగాంచిన మేటిదానవయి సప్తాశ్వైకధామానుభూ
త్యజహత్ప్రీతి వికాసమొంది యతనుగ్రామాఘబాణాకృతిన్
విజయంబొందిన నీవె నేడగుట భావింపన్ మదీయాంతరం
గజసంతాపముఁదీర్పవచ్చితివొ? వేడ్కన్ వారిజాతాగ్రణీ! 98

కం॥ నినుఁ జేపట్టినగతిఁ గృప । ననుఁ జేపట్టెద నటంచు నాళీకమణిని
న్నని చెనొ? తనకుదినీగతి । నని చెనొ? సరసత్వసుమర నాళీకవనా! 99

కం॥ ముద్దియ నెమ్మోమని నిను । ముద్దిడఁగాఁదలఁతు భువనమోహనమగునీ
ముద్దొంతదాచుకొనియెదు । తద్దయు నామోహగరిమఁదనరియుఁ దమ్మీ! 100

చం॥ అలపడి మామకోపాంగతాభిమతిస్పృహ నీవు సర్వముల్
దెలిపితిఁ గాన మోహనగతిం బ్రకుచాప్రతిహస్తభూతి సం
ధిల నను నూరడింపఁజను దెంచితొ? పద్మకులప్రదీప నా
తలఁపు నవిన్న నేఁ శోకనిధానము గాఁ ది[illegible]ఁ జెల్లదే? 101

కం॥ సేమమె సింధుసుతకుఁ? బరి ణామమె తత్ప్రియసఖులకు నవ్వాతదీయా
రామ లతికలకు భద్రమె? తామరసలలామ! శోభితశ్రీధామా! 102

తే॥ తలఁప మధుసూదనమనోరథంబుఁదీర్ప । నీవ నేర్పరివను టెల్ల నిక్కమయ్యె
నమితసౌజన్య! కమలాకరైకమాన్య । యబ్జమూర్ధన్య! చక్రరక్షైకధన్య!” 103

మ॥ అని యెంతేమదమంది తత్ప్రియవయస్యారత్నముం జూచి నా
వనజాతాయతనేత్రి యిట్లనియె “దేవా భావభూబాణపా
తనసంప్రాప్తితదేహతాపమగు పద్మాకాంతచింతామనో
మననం బేమనివిన్నవింతు నతివాఙ్మాత్ర్యాస చూపట్టఁగన్ 104

సీ॥ అనుజుఁడై నశశాంకుఁ డపకారియై తోఁచె దుండగంబునఁ గళాదుండు గాన
నంగజుండు తనూజుఁడయ్యుఁ దాపముఁ జూపె వివరింప నుగ్రవిద్వేషి గానఁ
బ్రాణపదంబయ్యుఁ బవనుండుఁ దల్లడింపఁగఁ జేసెఁ గడుఁ బ్రకంపనుఁడు గానఁ
గమలముల్ క్రీడాస్పదములయ్యు మొనమూపెసళ్ళములు కాండజాతములు గాన
విశ్వమందిర యిందిర వివిధగతుల । వాని చేనిట్లుమదిఁ గ్రాఁగి వగలవేఁగి
“విరహశిఖినాపఁగరమె యేకరణినైన? । నీకరుణలేక” యంచుఁ గన్నీరునించు

సీ॥ "నిఖిలలోకాలోకనిర్మాణుఁడగువాఁడు తేరకన్నొడుకఁడె నాదీనవృత్తి?
జగదశేషార్తి ప్రశమనాత్ముఁడైనవాఁ డాపలేఁడె మదీయతాపభరము?
సకలప్రపంచార్థసంవేదియగువాఁడు తెలియఁడే నామదితలఁపుకోలఁది?
అఖిలేష్టదాయకుండగువాఁడొసంగఁడే దూరింప కస్మన్మనోరథంబు
తామరసనాభుఁడన్నిఁటఁ దక్షుఁడయ్యుఁ । జిత్తమున నేఁడు నన్నుపేక్షించుటకును
గారణంబేమి" యనుచు నాకలికి కొమ్మ । నెమ్మదిని సంచలించుఁ గన్నీరునించు 106

చం॥ "గరుడరథాధిరూఢుఁడగు కన్నులుమీరఁగ గాన నోసుధా
కరరవులార! రేఁబగలు కాంచినవారలు మీరుకీరదు
స్తరవిరహంబు మీరయినఁ జక్కికినిం దయఁబుట్టునట్లు తె
ల్పరె" యని వెచ్చనూర్పుఁ గమలాసతి నీపయిఁ బ్రేమ నచ్యుతా! 107

తే॥ ఉదధిసుత చేతఁ దగు నీమహోత్పలంబు । తలఁచ నీలోత్పలంబయ్యెఁ దాపశిఖిని
గన్నె నీలోత్పలశ్యామునిన్నుఁ గూర్చి । యదియె కానుకఁ బంపె నిజార్తిఁ దెలుప

వ॥ అదియునుం గాక 109

చ॥ మతిమతి నంటినంటి తననూతనమాటలఁ జిల్కఁ జిల్కఁ స
ద్గతిగతి నెమ్మి నెమ్మి గలదాగలదా శయనింనునిందు నా
కృతికృతి నాపనాప గరకేగరకే దనిమిన్నమిన్నయై
రతిరతి రాయరాయ నిదురానిదురా కనుదాకదాకయున్ 110

కం॥ ఆకానఁ దడయ కానా । లీకాననఁ దేల్చు సరసశీలన్ గుసుమో
త్సేకయుతానేకలతా । నీకవృతారామసీమ నిపుణత" యనినన్ 111

శా॥ ఆమోదంబును జెందినందకధరుం డానెచ్చెలిం బల్కె "నో
భామారత్నమ! యిట్టిపయత్నమును సంభావించి యస్మన్మనః
ప్రేమావేశము లట్టిదే కద ప్రియాభిప్రాయమున్ నీ నచ
స్సామర్థ్యంబున నంతయుం దెలిసె నీసంకల్పమీడేఱఁగన్ 112

మ॥ గరిమన్ రేపె చతుర్ముఖప్రముఖలేఖశ్రేణి రావించి సా
గరరాజున్ శుభలీలఁ గన్యనమగంగాఁ బంచి కల్యాణవై
ఖరి పెంపొందఁ బరిగ్రహింతు నిదినిక్కం బంచు నయ్యిందిరా
తరుణీరత్నముతోడఁ దెల్పు మది సంతాపంబుఁ దీర్పంగ దే 113

కం॥ అని తామరసదళాక్షుఁడు । జని తానందమున నగుచుఁ దెలుపఁగ నుంగరమున్
వనితామణి చేతికి జ । వ్వని తానదిగొనుచు ముత్సవంబున మరలెన్ 114

శా॥ ఈరీతిం జెలికంపి యూఁకడిలె నాయిందీవరశ్యాముఁ డా
నీరేజాస్యవయస్యయున్ మగుడియున్నిద్రత్వరాముద్రతో
శ్రీరామామణిఁ జేరి సూరకిరణశ్రీభద్రికన్ ముద్రికన్
సారప్రీతినొసంగి యచ్చటి క్రియాసారస్యముల్ దెల్పుచున్ 115

ఆ॥ పోయివచ్చిన తెఱఁగెల్లఁ బొసఁగ నుల్ల । మలరఁబల్కుచు నిభ్భంగి నాశుభాంగి
పూప్రగుచ్చినచందానఁ బొలఁతితోన । తెలుప రత్నాకరకుమారి చెలువుమీఱి

చం॥ ముదమున నుంగరమ్ముఁగొని మ్రొక్కుచుఁ గన్నులనొత్తి సారెఁ జే
రెదపయినుంచి "నిన్ను జగదీశ్వరుఁడంపెఁగదా ముదార్తి నా
మదిబరితాపమార్పుటకు మక్కువతో" ననియూరటన్ రమా
సుదతి చెలంగె నంతనటఁ జూడఁదగెన్ శశి ధూసరద్యుతిన్ 117

మ॥ ఉదయంబందుచు నంబుజాసనత చేనొప్పెన్ సువర్ణద్యుతిన్
బిదపన్ సోముఁడుగాన శోభనరుచుల్ పెంపొందె నామీఁదటన్
దుదగట్టంది సితేతరాంగుఁడగుచుం దోఁచెన్ విధుండౌటఁ ద
ప్పదు మూర్తిత్రితయాఖ్యఁ డౌనఁదగెం బద్మారి ప్రత్యగ్దిశన్ 118

చం॥ మనసిజు చర్య యందుఁ జరమక్ష్మితిభర్త వినందదాజ్ఞ చే
ననుకలవార్తలెల్లసమయంబుముఖాదిలిఖించిపంపు నా
దినచరికమ్మదుద్దుపగిదిం దిగ వేకువఁ జందమామ వ
ర్ణన మొనరింప మధ్యవివరంబనఁ దోఁచెఁ గళంకమత్తటిన్ 119

ఉ॥ వేకువ తూపుచే సమయవీరరఘూద్వహుఁ డిందు వాలియు
ద్రేకము మాన్పఁ దజ్జయపరిగ్రహ కాంత నభోంతగార్కజున్
గ్రక్కొనవచ్చుఁదారయనఁగాఁ దగెఁ దూర్పున వేగుచుక్క ని
ర్వ్యాకుల తత్ప్రజాకలకలాగ్ఘటినాఁదగెఁ గుక్కుటధ్వనుల్ 120

తే॥ ఘనతరస్నేహకలనప్రకారమొంది । తమములణఁచుచు నిజతపోధర్మమునను
బూర్ణసత్వగుణస్ఫూర్తిఁ బొరసెననఁగ । నమరె నవ ఘోరుచుల దీపాంకురములు

చం॥ అలరెడు వేగుచుక్క విశదాస్యముగా నరుణోదయంపుడాల్
గళకుల కెక్కులార్పుచుఁ జెలంగెడి ప్రాగ్గిరిపక్షిరాజుఁ బెం
పలవడఁగాంచి భీతినెరయంగ నధోగతికిం దొరంగు కుం
డలితభుజంగపుంగవుఁడనన్ శశి గ్రుంకె నిరంకుశత్వరన్ 122

శా॥ పూజ్యంబైనయనంతరాజ్యపదవిన్ భోగేచ్ఛ నున్మత్తుఁడై
సజ్జ్యోతిశ్ఛిదఁ జేసి రాజు తుద నస్తంబంది దోషాపరి
త్యాజ్యస్ఫూర్తి నధోగతింబడియె నుద్యత్కాలధర్మాత్ముఁడై
"రాజ్యాంతే నరకం ధ్రువం" బను బుధప్రోక్తోక్తి తథ్యంబిలన్ 123

కం॥ జాతరతిశ్రమకాముక । జాతతనుజ్ఞాని పూని సడలించె సరో
జాతసుగంధపరీత । ప్రాతర్వాతూలజాల పటుచంక్రమముల్ 124

ఉ॥ తారలుదారె జారె హిమధాముఁడు కాముఁడు పాంథసార్థన
క్రూరతమానె. బూనె రహిఁ గోకము ఘూకము లాత్మసంభ్రమో
దారతవీడె వాడెఁ గుముదమ్ములు దమ్ములు సంగతాంగశృం
గారమునందె డిందె మదగర్వము సర్వము చంద్రికాళికిన్ 125

తే॥ అంతఁబద్మాసన ప్రళయాంతరమున । నరుణరుచిపూర తేజోమయాబ్ధి పొంగ
హరివసించుట కటఁబోల్చు నలఘువృత్తి । కనకవటపత్రమునఁ జండకరుఁడు వొడిచె

ఉ॥ విప్పగుతమ్మికుందెనల వేడుక నర్కకరప్రభాంగనల్
పుష్పాడిరాజనాలు నలపుల్ వెదఁజల్లఁగనించి సారెఁజాల్
దప్పిదంచనెత్తు ముసలచ్చుటలోయనఁ జూడవింతయై
యొప్పెఁ దదంతరాళపతదుత్పత దుద్ధతషట్పదావళుల్ 127

మ॥ ఆదికారప్రతిభా! కృపారసప్రపన్నత్రాపాంగ! తాపాంగనా
ద్యావలిప్రార్థితసువ్రతాంగకృతసాంగోపాంగ! గోపాంగనా
ర్జవసౌందర్యముఖాబ్జలోలుపమనస్సారంగ! సారంగ బం
ధవిముక్తిప్రథితత్వరా! విలసద్యామాంగ వామాంగజా! 128

చక్రబంధము

శా॥ సత్యారక్త! భవేంద్రవందితపదాబ్జా! శత్రుశైలాశనీ!
సత్యామానితకల్పకవ్రతపురస్థాయజ్ఞభానస్థలీ!
నిత్యానిష్కపటేహభంగతతబాన్ధీశస్తభీముగ్ధనీ!
నిత్యావాసవిలాస! గానవిపుణా! నీలాంగ! నీలాఘనీ! 129

కం॥ బృందావనవిహరణ! గో । బృందావననిపుణ! పుషితబృందారక! పౌ
రందరమణిరుచికందర । మందరధర భక్తఫలదమందారనగా! 130

గద్య. ఇది శ్రీరాయసము వెంకటపతిమంత్రివర్య ప్రణీతంబైన లక్ష్మీవిలాసంబను
మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



# లక్ష్మీవిలాసము.

## పంచమాశ్వాసము.

కం॥ శ్రీవనితాకుచకుంభ। ప్రావృతమృగనాభిసౌరభాస్తకకమనో
భావుక! శుభదాయక! శ్రీ। డావిపులకటాక్ష! వెంకటనగాధ్యక్షా! 1

వ॥ అవధరింపుము తరువాతివృత్తాంతంబు జనమేజయునకు వైశంపాయనుండిట్లనియె
దనంతరంబున 2

మ॥ వనజావాస యథోచితక్రియలునిర్వర్తించి వైవాహికాం
గనసంరంభనిరీక్షణోత్సవము నాకాంక్షింపుచున్నంత మే
ఘునిభాగుం డటమున్నె యుక్తసరణిం గాల్యక్రియల్ తీర్చి శో
భనసంసూచకమందహాస మిగురింపన్ సొంపు వాటింపుచున్ 3

సీ॥ జిగిదేర వగమీఱఁ దగ నోరసిగవేసి సరివ్రాలు[illegible]మాలు సంఘటించి
నలువొంద ననుకుందనపుగంద మెసఁబూసి యొగిఁ బాణి నుప్పాణియొంట్లుదాల్చి
సిరఁబట్టమగుపట్టు యారచట్టనవరించి వరహేళిరుచిఁ దాళి నఱుతనుంచి
రహిఁజూపు మణినూపురముఁ గ్రపునధరించి కటిసీమఁ బటుహేమపటముఁగట్టి
పొసఁగనీభంగి శృంగారముల నెసంగి। భాసమానాగ్రరత్నసింహాసనమున
నంతఁగొలువున్న నిజదేహకాంతివిజిత। వనధరుండగు నాసుదర్శనధరుండు 4

ఉ॥ జిబ్బుమెఱుంగుచల్వలు విచిత్రగతిం గొడిఁబెన్ముఖామహో
జిబ్బిలువేళఁ గాంచి హరిసేవకురా సమయంబటంచుఁ
బబ్బటుచీట్లువ్రాసి నిజభర్తలపాలికిఁబంచి రంతలో
నబ్బలిబంధనుండును భవాబ్జభవాదులఁబిల్వఁబంచినన్ 5

సీ॥ తన పురాలోకంబు తనపురాలోకంబు చెలువున ముక్తవాంఛితము గాఁగఁ
దన విగ్రహస్ఫూర్తి తనవిగ్రహస్ఫూర్తిపగిది నక్షయశరప్రతిభనమరఁ
దన సామభాషలు తనసామభాషల తెఱఁగున ననురాగపరతఁజూపఁ
దన సుధర్మాధిపు తనసుధర్మాధిగతి సాధులోకసంభృతి నెసంగ
నలినగర్భుండు నగధన్వి నారదుండు నముచదమనుండు వచ్చిరానగరమునకు
బరమపుణ్యులుప్రమథులు లాపర్వతాదియతులు పావకముఖ్యదిక్పతులుగొలువ

చం॥ రయమున నిట్టురా నవసరంబులవారెదురేగి కొల్వు వే
ళ యనుచుఁ దెల్ప యుక్తవిధులన్ సముఖంబునఁ జేరి కానుకల్
శయములఁ గూర్చి నమ్రులయి చక్రధరుం బొడఁగాంచి యంచిత
ప్రియములు నర్హపీఠముల శ్రీకరలీల వసించి రత్తఱిన్ 7

కం॥ దారసివనాత్మనెంతయుఁ । దారసిలవిలోలవృత్తిఁ దగు హరిహృదయం
బారసి సారశుభోన్నతి । నారసి లేఖావతంసు లనిరిమ్ముయిఁ గ్రిన్ 8

సీ॥ బాడబాశాపూర్తి పరజీవనము వాఁడు భూరిసద్గుణమణిస్ఫూర్తి వాఁడు
ప్రతికళోత్కళికా పరంపరాయుతి వాఁడు పంకంబు నడుగంటబఱచు వాఁడు
సరసోత్తరగభీరశబ్దసంగతి వాఁడు బహువాహినీశక్తబలము వాఁడు
తతభూమిభృత్కులాధారపద్ధతి వాఁడు ద్వి(జరాజహితవృత్తి దిరుగు)వాఁడు
దీయమానోర్జద) మృతాన్నధనురత్న । హయగజాధికతోషితస్వాంతవిబుధ
వరకృతాశీర్వచనపరివర్ధమాన । కీర్తిమప్పాంగువాఁడు లక్ష్మీగురుండు 9

తే॥ తేజమున మీకు నాత్మతనూజనొసఁగి । ధన్యుఁడగుఁగాక వాంఛితార్థములఁ బొసఁగి
కన్నెఁగైకొమ్ము పరిణయుకలన నెసఁగి । తనివినొందెద మే మమృతంబు మెసఁగి

కం॥ కల్యాణాంగన్ మొక్కటి । కల్యాణాహార్యధైర్య! కలదీ రజనిన్
గల్యాణవాగుచితసా । కల్యకై కొను వివాహకౌతూహలమున్" 11

కం॥ అనవిని హితసంగతి నొ । య్యన విని హితచిత్తుఁడగుచు నాహరి లోకా
వననిధి యాగుణనిధులన్ । "వననిధి కేతన్మహోత్సవముఁ దెల్పుఁ"డనన్ 12

కం॥ హరియానతి నతిపుతుకా । దరమున శిరమున వహించి తామరసభవుం
డురుగతి వరయతి సురతతు । లరుదేర నదీనమణి గృహంబున కరిగెన్ 13

చం॥ అతఁ డెదురేగి వారల గృహాంతరసీమకుఁ దెచ్చి రత్నరా
జితకనకాసనంబుల వసింపఁగఁ జేసి వినమ్రుఁడై యథో
చిత వివిధోపచారములఁ జెల్వుగఁ బ్రదుప్తులఁ జేయ నాయెడన్
గుతుకముతో సరిత్పతిని గూర్చి సరోరుహగర్భుఁ డిట్లనెన్ 14

శా॥ "ఓరత్నాకర నీకుమారిక వకుంఠోదారికిన్ శౌరికిన్
సారోదారికి దారగా నొసఁగ నుత్సాహించు నీవాంఛ యీ
డేఱున్ వేడుకఁ దచ్ఛుభాచరణపాండిత్యంబుఁ బూనందగున్
సారంబైనమహార్త మీనిశఁ బ్రశంసస్ఫూర్తిచే నొప్పెడిన్ 15

సీ॥ పంకజబంధుసౌభాగ్యంబు పదములఁ దారకావరసఖత్వము నఖముల
శారిమంగళమైత్రి జంఘల బుధనుతాభోగసంరంభానుభూతి తొడల
గురుసుదర్శనయోగ్యసుశీలత కటిసీమఁ గవివర్ణనీయసాంగత కుచముల
సారకళామోదసంపద మోమున రాహుసౌహార్ద్రవిభ్రమము వేణి
ననఘకేతుసమగ్రశోభనత మేనఁ । దగవరానుగ్రహరుచి నీతనయ దనరెఁ
జక్రియును దత్పరిగ్రహాసక్తి నొనరెఁ । జలధివర నేఁడు పరిణయోత్సవము నడపు 16

కం॥ అని విధి దాఁ గన్నరసా । యనవిధిగా నిటులఁ బరిణయారంభమునూ
తనసోదరవనజోదర । ఘనమోదరసంబు తేటగాఁ దెల్పుటయున్ 17

మ॥ పరమానందమునన్ నదీశుఁడనియెం బ్రోద్యోక్తి "నో భారతీ
శ్వర! కన్యాబ్ధిచతుర్భుజుండఁట సుశోదారుల్ భవన్ముఖ్యాని
ర్జగవర్యుల్ మఱి పెండ్లిపెద్దలఁట యీసౌభాగ్య మస్మత్తపః
పరిపాకంబఁట యింతకన్నఁ గలదే భావేహ యూహింపఁగన్ 18

కం॥ వినవచ్చు నేస్వతంత్రుం । డనె హరికిన్ విన్నవించి నడపుఁ డుచితవ
ర్తనములు "కర్తాభోక్తా । జనార్దన" యనెడి సఫలతఁ జెందన్" 19

కం॥ అనియుక్తరీతిఁ దన హృద । యనియుక్తసునీతిఁ దెల్పి యంగీకారం
బున రుచిరాన్వితి వారికిఁ । బునరుచితాపచితిసల్పఁ బూర్ణోత్సవులై 20

మ॥ విహగస్యందనుపాలి కేగ యటఁ దద్వృత్తాంత మత్యుత్సవా
వహసూక్తిన్ వినిపింప నెమ్మది నఖర్వప్రీతి నందించె న
మ్మహిళామన్మథుపంపునం బురము సంపత్పూర్ణకల్యాణ సం
నహలీలం గయిసేయఁగాఁ బనిచె సైన్యస్వామి చిత్రంబుగాన్ 21

సీ॥ మెఱుఁగుజవ్వాదితో మేళవించిన మంచిపునుఁగుమరసచర్చ కుదురుకొల్పి
గొజ్జంగపన్నీరుగూర్చిన ముత్యంపుసన్నసున్నంబులు సంఘటించి
సరసరీతి శిలారసంబుతో మెదిచిన పచ్చికస్తురిచాదుపట్టెలునిచి
పూనీరుకలువపుష్పాళ్ళనుదంపించి నునుపుమీఱంగఁ గల్పనముఁ జల్లి
పగటుముత్యాలముగ్గులు పచ్చతోర । ణములు బంగారునరఁటికంబములు నగరు
ధూపములు రత్నదీపంబు లేపుమిగుల । నలఘుశృంగారమొనరించి రప్పురమున

శా॥ మిన్నాబంగరుకాగితంబులను గాశ్మీరంబుచేఁ జిల్కియున్
వన్నెల్గా శుభలేఖ లెల్లెడలకున్ వ్రాయించి యాపైసిరుల్
చెన్నారన్ విలసత్సుదర్శనశిఖాచిహ్నంబులొత్తించి భా
స్వన్నీలన్ భువనాధినాయకులఁబిల్వంబంచి రంచద్గతిన్ 23

వ॥ ఆసమయంబున 24

మ॥ బహురాజ్యావసపట్టబంధములు గాభావించి శ్రీసూనున
రహిం నాలేఖలుదాల్చి లేఖపరివారంబుల్ సదారంబులై
మహనీయాదృతిరాఁగ సైన్యపతి సన్మానంబుతోడన్ శు
భావహలీలన్ విడియించె వారలను జాళ్వా బల్పిదారంబులన్ 25

తే॥ సింధుకన్యకఁబరిణయశ్రీదలిర్ప । వేడ్కతోఁ బెండ్లికూఁతుఁ గావించుటకును
మంచివేళని సప్తార్చిమానవతులు । దెల్పఁ దచ్ఛుభారంభ సందీప్తులగుచు 26

మ॥ వికసన్మౌక్తికరంగవల్లికలతీవిన్ మించు కల్యాణవే
దికపైఁ బచ్చలపీఠనంబునిడి పుత్రింజేర్చి యాకల్మిప్రో
డను దీవింపుచు నక్షతంబులిడి పాటల్ పాడుచున్ భవ్యవా
క్ప్రకృతిన్ నల్గులు నెట్టి రిందువదనల్ కాశ్మీరచూర్ణంబునన్ 27

తే॥ శంఖభేరిమృదంగాదిసకలవాద్య నినదములు నర్థివీచికానినదములును
గూడి యామ్రేడితంబులై కూర్మినపుడు విశ్వమందుట కెమరుకోల్వ్యోధమునడపె 28

కం॥ కరపుటపటులయగతి మే నరమరవహియింప నఖముఖాపాదితచా
తురి సంపెఁగనూనియచే శిరసంటెన్ వాణిసిరికిఁ జిత్తముగదురన్ 29

మ॥ బిగిచన్నుంగవరాయ హారకళికల్ పెంపిల్లగూయన్ నవీ
నగతిన్ మోముచెమర్ప దృష్టు విరిదండల్గూర్ప నూర్పుల్లగన్
మకుడింపన్ వణిసంకణక్వణనసన్నాహంబురా శింప సం
పెఁగనూనెన్ శిరసంటె వాగ్రమణి లక్ష్మీకాంతకున్ విందగన్ 30

శా॥ శీవిన్ వాణి సరోజవాసిశిరసంటెన్ సత్తతాళప్రభే
దావల్గద్గతి యుంబకస్ఫురణ పెంపారన్ బసన్మూర్తి సు
గ్రీవోత్తానకళాప్తిఁ దెల్ప నుకరక్రీడాకృతస్నేహహా
సావిన్ రామకథాప్రసంగరుచిమించన్ సొంపువాటింపుచున్ 31

మ॥ కరజాపాదితరాగలై పులకరేఖావిస్ఫురద్గండలై
నిరపాయామృతపారవశ్యముకళన్నేత్రాబ్జలై చాదని
స్వరదుచ్ఛ్వాసవిలాసలై విలులితాంచత్కేశలై సత్కృశా
నిరతిం దారతిసౌఖ్యమంద శిరసంబెట్టెన్ వాణి కల్యాణికిన్ 32

వ॥ తదనంతరంబ 33

కం॥ ఇంతులు గంధపుటంటలి । కాంతకునిడి పెనువనిగుడెంగచములనురపుల్
కాంతగతి విఘుంతుదవద । నాంతరనిష్కాంత తరసుధాంశువెపోలెన్ 34

మ॥ హరికింబట్టపురాణివీవయని కల్యాణైకవాక్యస్థితుల్
పరఁగం బుణ్యనదీనదోదకములం బట్టాభిషేకంబుఁ జే
సి రసానుజ్జ్వలహైమకుంభముల చేఁజేతన్ సుగంధాంబువుల్
హరిసుధ్యల్ తగనించి నించి జలకంబాడించి రబ్జాలయన్ 35

కం॥ శిరసుతడియొత్తి ముపటపు । నెఱిసెల్లాఁగట్టి హరినిలయము వెడలెన్
శరధిసుత గంధసహారతి । శరధివినిర్గతలతాంతశరధగ్గరిమన్ 36

మ॥ ఘనసన్నాత్యాయమానసాంద్రయుపవినిష్క్రాంతక్రియామేయమో
హనకేళీకలహంస్యలీలఁదగ నీరాగారమున్బాసి వా
రిని ఫేనాత్మజ నీలమంజులపిత్తర్గన్ విశ్రమించెన్ ముకుం
దుని బాహాంతరవేది నీగతివసింతున్ వేడ్క నన్నట్లుగన్ 37

వ॥ తదనంతరంబున 38

తే॥ శిరసునీరార్చి పెన్నెఱుల్ చిక్కుదీర్చి । నున్నఁగాముప్వ్రజపవేసెఁ గన్నెయొకతె
బాలచెలువొందె నవభృంగమాలికాను । గత లతాంత లతాపరిష్కారమమర 39

కం॥ చంపకగంధియొకతెదా । సంపల్లలితాంగిజపను జాతుర్యమునన్
సంపెంగపూలుచుట్టెను । శంపాధృతజలజరేఖ చందము దెగడన్ 40

శా॥ భూతిస్తోత్రకరూపలక్షణయుతంబుల్ శ్రీకరాలోకవి
ఖ్యాతంబుల్ సుగుణాన్వితంబులు వినూతౌఘంబు లీరత్నముల్
నీతోఁబుట్టువులంచు జన్మగృహగణ్యోన్మేషకభూషావళుల్
చేతఃప్రీతిఁదనూజవల్లియొసగెం జేకాన్కఁగా నత్తటిన్ 41

కం॥ అంబరమణి కాంతస్థగి । తాంబరమణి యొకటి తెచ్చి యతఁడిట్లనెనో
యంబ రమణికై కొనుమీ । యంబరమణి చూడిసంపదాస్పదమరయన్ 42

తే॥ ప్రౌఢిసకలార్థగోచరప్రతిభ నంద, మైనరుచిఁగాంచి శబ్దగ్రహానుగుణ్య
తారకానూన వైచిత్రిఁదనరుకతన, నబ్జపళ నేత్ర యిది నేత్రమనఁగఁబరఁగె 43

మ॥ అకలంకప్రతిభాభిరామ మనుగుణ్యానంతరత్నప్రభా
వికలం బక్షయరూపవిభ్రమ మనావిష్కారదోషం బఖం
డకళామండితబంధురం బహహా వేద్యం జిత్ర మీయర్జునాం
శుకమై సర్గికముగ్గడింపఁ బరమే సుత్రామరత్నాలకా 44

కం సరసతటిత్ప్రద్మాంకము వరపుష్పవదుదయరాగవర్ణితము సదా
దరణీయగంధవహాభా స్వర మీయంబరము దివ్యజనపదము సుమీ 45

ఉ॥ అచ్యుతనంబుజోదరభుజాంతరమందనపాయమై యజాం
డచ్ఛటలీక్షణాంచలవిడంబమునన్ సృజియింపఁ జాలు న
ద్వ్యచ్ఛుభలీల నిశ్చలసుఖాయతిచేఁజెలువొంద దీనువ
గ్గచ్ఛదమున్ ధరించి చరణస్ఫురణాధరితాబ్జవిభ్రమా 46

మ॥ ముదితల్ నోములునోచునైదువతనంబున్ నిస్తులాపత్యసం
పదయున్ సర్వజగచ్ఛరణ్యమహిమోపన్యాసి సల్లక్షణా
స్పదసౌభాగ్యముఁ గల్గియొప్పమనుచున్ బ్రౌఢోక్తి నాహైమచి
త్రదుకూలంబొసఁగెం దనూజకు సరిత్కాంతుండు దీవింపుచున్ 7

శా॥ అచిత్రాంబరభూషణావళు లమందానందనిష్యందిద్వ
త్ప్రాచుర్యంబెనఁగం గ్రహించెఁ గమలాకల్యాణియౌచిత్యముల్
భూచక్రంబున వట్టిదేకడ సతుల్ పుట్టింటివారిచ్చు సం
క్షోచాలంకృతమైన గారవముఁ జేకోఁజాలు రిచ్ఛారతిన్ 48

కం॥ శ్రీలెసఁగు హేమవసనం। బాలేమ ధరించెనప్పు డధోంచల విలస
న్నీలావళిచరణాబ్జమ। దాలనటాదళివరాళి యండముఁ దెలుపన్ 49

తే॥ సుముఖశశిపార్శ్వ (సంస్థిత) విమలతార, కాగణములనము త్తైలకమ్మలమర
నతివకుతుకంబుఁ దాల్చెఁ దదంతికస్థ, పరిధరేఖార్థ శృంగారభావమమర 50

కం॥ మేలగుపాపటబొట్టా, బాలికసీమంతసీమఁ బాటింపఁదగెన్
నీలాభ్రమండలాంతర, ఖేలత్కుముదాప్తదీప్తకిరణమువోలెన్ 51

కం॥ దోషాకరునెనసివసిరి, రోషాకృతిఁ దొలఁగఁదలఁచురోహిణివోలెన్
యోషామణినానామణి, భూషామణ్ణితములువొందుపొలుపుందలఁపన్ 5

క॥ అంగనకుచకుంభంబుల । సంగతమై మౌక్తిక త్రిసకము లెసఁగెన్
రంగద్గాంగేయాచల । శృంగనటత్త్రిపథగాఝురిత్రయలీలన్ ॥ 53

మ॥ కమలామోద్యత్కరపుష్కరాగ్రసరణింగన్పట్టి మేఖైయనం
తమణీవిస్ఫుటకంకటగ్రహణకృత్యంబంత సద్రత్నచా
రిమకాంచీవరమధ్యదేశ మెసఁగెన్ శ్రీమంతముల్ కోటిసం
భ్రమములన్ సారసవర్ణనీయపదసీమన్ మించె నంచద్గతిన్ ॥ 54

క॥ ఈగతిశృంగారంబులు । వాగతిశయరీతిఁ బూని వనజాస్యమనో
రాగవశావేగదశా । యోగవిశాలాత్మపరిణయోత్సవకాంక్షన్ ॥ 55

క॥ ఉన్నతటీ నటఁ దటాలున । నున్నతరిపుదమనుఁ డంబుజోదరుఁ డత్యా
సన్నసుముహూర్తవార్తా । సన్నవదానందవాద్యసంభ్రమ మెసఁగన్ ॥ 56

క॥ కుందనవమాలికలఁదగు । కుందనపుం బెండ్లిచవికెఁ గూర్చుండినచోన్
జందనగంధులపుకుహరి । చందనఫలకను మతతు లొసఁగిదీవింపన్ ॥ 57

తే॥ అనునయముతోడ గరుడవాహనునకపుడు । గమకమున నూర్ధ్వశిరసం టెదమక మెసఁగ
సముఖమున నిల్చినఖకోరకములతోను । సిరులు దళుకొత్తసిక విచ్చి కురులు దువ్వి ॥ 58

మ॥ పరఁగెన్ శౌరిశిరోరుహంబులు ద్విరేఫఖ్యాతి నెంతే మనో
హరవత్పాణిసరోరుహంబులు ద్విరేఫాకారతన్ మించ ని
త్రతి స్నేహోప్తిఘటింపనొప్పగు మరందస్ఫూర్తిగా నంచుఁ బె
న్నెఱులం గమ్మనినూనెచిల్కు శిరసం టెంగాంత శ్రీకామికిన్ ॥ 59

తే॥ చంపకామోదమూర్ఛితచంచరీక । తతికి శైత్యోపచారంబుతగ నొనర్చు
పగిది నా కేశవుని కేశపంక్తి నంత । నబ్జముఖియొత్తు గంధంపు టటకలిడియె 60

సీ॥ సకలతీర్థాస్పదచరణనారాయణునకుఁ బుణ్యనదీజలస్నానమనుచు
మహిఁ బటాంతరములేని హిరణ్యపటునకుఁ బటుతరాచ్ఛదుకూలపటములనుచు
గంధవతీభోగకళలఁ జొక్కెడు దివ్యగంధమూర్తికి సారగంధమనుచు
నహిభూషణస్తుతానర్ఘ్యకౌస్తుభవిభూషణునకు రత్నభూషణములనుచు
గీ॥ సఖులు గంధోదకములమజ్జనముఁ దీర్చి । చలువలందించి ఘనసారచర్చఁ గూర్చి
లలితబహుభూషణములనలంకరించి । రపుడు జగదేకవంద్యునకలముగతుల॥ 61

వ॥ ఆసమయంబున

ప్రసేలు

తే॥ మనసిజుఁడుకొన్ని శరములు మొనలుదీర్చి। నట్టికరసానఁబడఁద్రోచెననఁగ నినుఁడు
గ్రుంకెమతికొన్ని మెఱుఁగుదీర్చుటకు నిడిన। మించునను సానయన నుదయించె విధుఁడు 63

కం॥ అయ్యెడ లగ్నము నికటం। బయ్యెననుచుఁ దెలుపునంతనబ్ధిపిలువరా
జయ్యానయ్యానఘుఁడు మది। నెయ్యముగను క్రంతముదముని గుడ వెడలుచోన్ 64

సీ॥ వేత్రభృద్విద్రుమవేత్రదీప్తులమించె నగణితకరదీపికాయతార్చి
యగణితకరదీపికాయతార్చులమీఱెఁ బృథుసువర్ణచ్ఛత్రరేణుకాంతి
పృథుసువర్ణచ్ఛత్రరేణుకాంతి నెసంగెఁ దతకేతనాగ్రరత్నప్రకాశ
తతకేతనాగ్రరత్నప్రకాశనిగుడ్చె గగనగంగాహైమకంజరోచి॥

గీ॥ పూర్ణచేతోమయంబయ్యె భూనభోంత। రంబులప్పుడు నిఖిలసురప్రముఖులు
సుముఖులైతమయనిమిషత్వము ఫలించె। ననుచు నివ్వెఱపడి చూచిరద్భుతముగ 65

తే॥ కంతనాదార్భటులనుపకంతసీమఁ। గంచుకులు స్వామి! హెచ్చరికంచుఁ దెల్ప
గారగానెలుమోయ సగౌరవమున। జగహజారంబునకు వచ్చె జగతివిభుఁడు 66

ఉ॥ సౌరకిరీటసంకషణజన్య హిరణ్యరజంబు చామరో
ద్ధారిమరుద్గతిన్ నిగిడి గాఢతరధ్వజవాతధూతమై
భూరిదిగంతరంబులు నభోంతరమంతయు నిండెఁ దత్క్రియన్
వారిజసంభవాండము సువర్ణమయంబని లోకులెంచఁగన్ 67

సీ॥ భుజగులయెడఁద్రొక్కుపొంకాన నాలీఢచరణాబ్జుఁడై జంగచాచినిలిచి।
పద్మభవాండముల్ బంతులాడెడిపోల్కి రాజత్కరప్రసారణమొనర్చి
కలుషతూలంబులఁగంచుమించుగరువ్వు నావటంబున నెక్కలాప్పుదీర్చి
యమృతకుంభస్పర్శనైన శుభ్రతయనాఁదగు ముఖరుచి నిందుజిగిహరించి

గీ॥ యరుణఘృణిదీప్యమానదివ్యాంగుఁడగుచు। మ్రోలనాయతమై సుపర్ణుండు నిలువఁ
గనకశృంగాధిరూఢమేఘంబపోలె। వేడ్కనారోహణంబొనర్చె విజయసఖుఁడు॥ 69

కం॥ ఖేటకశయహాటకమయ। ఖేటకచయను పుడుమగుడగిరికొని యెజగ
న్నాటకనిగమాటకఖగ। ఘోటకమకుటాగ్రముననగోచరమహిమన్॥ 69

క॥ గొడుగులునడచప్పరములు। పడగలుబడిబడిగనుభయపార్శ్వంబులరా
నెడనెడఁబూవులవానలు। జడిగొనగుడిగొనెడివాద్యసంభ్రమమెసఁగన్ 70

తే॥ పరఁగు సేనఁగంబాయిల పైఁడిమాముల లఘునుని వెంటబోరుకలంగఁ దోడఁగ
వివిధగతులను వార్షిక వేళ నడచు జలదపంక్తులు గర్జించు చందమమర 71

సీ॥ అఖిలాండకోటిబ్రహ్మాండనాయక! వేదవేదాంతవేద్య! బ్రహ్మాదివంద్య!
దేవదేవోత్తమ! దేవతాసార్వభౌమ! పురాణపురుషోత్తమ! పరమాత్మ!
శరణాగతార్తరక్షణ! సర్వజీవదయాపర! కోటిసూర్యప్రకాశ!
యాపన్నివారణ! హరి! భక్తవత్సల! ప్రహ్లాదవరద! గోపాలతిలక!॥

గీ॥ బంధమోచన! శ్రీసతీప్రాణనాథ! దీనమందార! పరవాసుదేవ! మమ్ము
నరసియేప్రొద్దు రక్షింపుమనుచు! సకలజనులు మ్రొక్కి జయజయశబ్దమెసఁగ॥ 72

సీ॥ అమరగంధర్వగానము స్వరానందమై యది స్వరానందమహాటద్భుతంబై
పరఁగె మృదంగశబ్దము సముత్తాలమై యది సముత్తాలమహాటరయ నడుదె
తగెనప్సరసలనర్తనము గోచరలీల నది యగోచరలీలఁ బొదలఁదగదె
తనరె విద్యాధరస్తవము భాషాప్రౌఢి నదియె భాషాప్రౌఢి నలరఁజనదె

గీ॥ యనుచుఁ జూపఱపొగడంగ నమితపటహ శంఖకాహళడిండిమఝర్ఝరాది
వాద్యరభసంబు లెసఁగె దివ్యమణివిపణి నవజలదమూర్తి వేంచేయునవసరమున॥ 73

వ॥ అట్టినీలమేఘశ్యాముసెదుటఁ బర్జన్యాదిదేవతలు పరఁగించుతోలకరిమెఱుఁపులోయనఁ గాంచనపాంచాలికలంబోని చంచలాక్షులు కరాంచలముల హాటకమయంబులగు వేటుపావడలు నిగిడింపఁ దదీయోత్సవసందర్శనకుతూహలులై బారులుదీరి సేవించు బలాహకపంక్తులోయన నుభయపార్శ్వంబులం బొదలు ధవళచామరంబులు దంబు మీఱ సేవార్థసమాగతద్వాదశాదిత్యుల చందంబునఁ గుందనపుసురటులు సందడింపఁ దదామోదపులకితద్వాదశార్కసహస్రకరమండలంబు లపరిమితంబులై మిన్నందె నోయన నాకాశబాణంబులు గగనంబునంబఱవ శరణాగతవారణాపన్నివారణ త్వరాసముత్థిత తదీయపదగ్రస్తజలగ్రహ శిరచ్ఛేదనక్రియాపరిభ్రమదవక్రప్రయోగ చక్రపరాక్రమంబు హరిమ్రోలనభినయించుపోలికఁ జక్రవారబాణంబులు విజృంభ ణంబులై సంభ్రమింపఁ దన్మహామహిమంబు తగిలిచూచు ఖేచరకువలయాక్షుల కను దనుకులు ప్రసరించువడువున యంత్రంబులఁ గలువపూవులు జలజలరాల బర్హిర్ముఖుల చేఁ బ్రతిదినంబుఁ బావనంబుచేయంబడుటఁ జేసి తన్ముఖతాపంబు సహింపనోపక త పింపుచు మహికిఁ జనుదెంచిన చంద్రకిరణంబులోయన నిరుగడలఁ జంద్రజ్యోతులు

చెలయు-కుంకుమరసంబులఁ బంకజముఖులాడు వసంతమహోత్సవంబున నిండారఁ బూచిన కనకచంపకశాఖలవైఖరిని వరుసగొని బిరుసులు మెఱుపు సెలపగొడిగొని కలుగడల . నెడతెగక నిగిడించు బహువిధకౌతుకాగ్ని యంత్రచిత్రంబులకు విచిత్రంబునంది బృందారకులు కృశానునకొసంగిన చామరంబులన వింజామరంబులు కోపుదీరుగింపుల సెలవుమిగిలి కైపుఁజూప-చూపరచిత్తంబులకుఁ దగుల్పబచుటకు మరుని మెఱుఁగమ్ములు తమకు హస్తగతమ్ములై యున్నవని తెలుపుసోలపునఁ గనకపుండరీకకాండంబులంబోని బంగరుకోలలు కేలంబూని మోహనాంగుల పారశ్యంగారంబులు సెలపుచుఁ గోలాటలాడ-విరించి సృజనకన్న నితనిసృజన విస్మయంబైతోఁచెనని విశ్వజనంబులు పొగడ విచిత్రానర్ఘ్యచిరత్న భూషణంబులు వివిధాంబరంబులు విలసత్కర్పూర కాశ్మీర కస్తూరికాది గంధసారముఖ పరిమళ ద్రవ్యంబులు వినోదకరభూషలు కుసుమపదార్థంబులు విమలమణిమయంబులగు హరిహణంబుల విలాసవతులచే విష్వక్సేనుండు విబుధవరపురస్సరంబుగా సపారంబులగుకోరికలు నడపింప-లక్ష్మీరమణునకు రోహిణి క్షేమకారిణిగావునఁ దారాబలంబు సమగ్రంబై యున్నయది యని చూపువైపున సువాసినులు సువర్ణపాత్రికల సేసలుదేర- ఇట్లివాఙ్మనసగోచరంబగు మహావైభవంబున సకలజనులకుఁ బ్రసన్నుండైకోరికలునడపింపన న వరంబులు నాలుగు హస్తంబులఁ బ్రసాదింపుచు వందారుమందారుండగునిందిరావిభుండయ్యెసెయ్యన రత్నాకరనగరంబుచేరంజని కక్ష్యాంతరంబులుగడచి మందిరాంగణంబున గరుడావతరణంబుజేసి నిధిపతిసమర్పించిన నిర్మలపాదుకలుమెట్టి నికటంబున నవరసంబునిరీక్షించుచుఁ జంద్రశేఖరునికై దండఁబూని యెడనెడ మయూరగమన షడ్జస్వరంబుతో ధవళంబులుపాడుచు నీరాజనంబులొసంగఁ గంచుకవతులై సంగ సంగీతమేళంబులతో శుద్ధాతంబునకరిగి కురంగటముక్తామయకాయమానదేదీప్యమానంబగుకల్యాణవేది నింద్రాణియిడు చింతామణిభద్రపీఠంబున వసియించుసెడ

కం॥ కన్యావరణముశుభవా।క్కన్యాయముఁజేసిహర్ష కరవిజయశ్రీ
కన్యాజీవితసాధున।కన్యాకారహితునకునజానుసుతముసర్॥ 75

సీ॥ వినతాతనూజాసనున కాసనము తీర్థపాదున కర్ఘ్యపాద్యాదివిధులు
సిరసుధామధురభాషికిమధుపర్కంబు హైమాంబరునకుఁ బీతాంబరంబు
దివ్యసౌరభ్యమూర్తికి గంధలేపంబు కుసుమాస్త్రగురునకుఁ గుసుమసరము
అనఘకౌస్తుభభూషణునకు భూషణములు తేజోమయునకు నీరాజనంబు

గీ॥ అనుచు నామోదరసమున ననుమకోర్కె। యుక్తవిధులనుగడు భక్తియుక్తచిత్తుఁ
డగుచుఁ బూజింపనుతిచేసినగుచు నపుడు। నాకరమణార్చితుఁడగురత్నాకరుండు 76

కం॥ సరసముగఁ బద్మరాగము। తెరయెత్తి రమరుగగానదీగురు నెదుటన్
సరసముగఁ బద్మరాగము। తెరయెత్తినదిటులననుచుఁ దెల్పెడిభంగిన్॥ 77

కం॥ తోడుత నా పెండ్లికూఁతును। దోడుకరమ్మనుచుఁ గడఁకతో నా సిరిచే
దోడ సుధానిధిప్రోడలు। వోడుక రానరిగియతికుతూహలలీలన్॥ 78

చం॥ మతుల భవాజభావులు మనోహరరాగవిశుద్ధవర్ణసం
గతిధవళంబుఁ బాడుకలకంఠులు మాధవలీలలాస్య చి
త్రతఁ గొని యాత్మ నాత్మకరరాజితమైనదుకూల మిందిరా
పతికి ముసుంగు దీర్చి సరసస్థితి చంద్రుఁడు దోడితేరఁగన్॥ 79

సీ॥ సీరశరత్కాలసితవారివాహ పరీతసౌదామినీరేఖయనఁగ
వియచాపగాక్షీణవీచికాచ్ఛాదితదీప్తసౌవర్ణ పద్మినియనంగ
సైంధవప్రాలేయబైందవావృతసముంచితరత్నసాల భంజికయనంగఁ
గమనీయ హిమవాలుకాపరాగచ్ఛన్న లలితవాసంతికాలతికయనఁగఁ॥

గీ॥ బొసఁగఁ దెలిజీబుముసుఁగుతో నెసఁగి చెలులు। బొదవినడిపింపముక్కలిమదవికాస
మసురవిభవంబు చేరమాభ్రమర వేణి। మెఱుఁగులీనెడు తెరఁజొరఁగ నరుగుటయును॥ 80

కం॥ దేవమునిగణములప్పుడు। "దేవీంవాచమజనయత దేవా" యనుచున్
దీవింప శరధియాజ్ఞ। దేవిందగధారవోసె దేవిగహరికిన్॥ 81

చం॥ సురలుముహూర్తవేళ యనుచుం దెరదీయ శిరంబులం దతి
త్వరగ గుడజీరకంబులిడి దంపతు లింపునదృష్టిఁగూర్చి చూ
చిరి యితరేతరాస్యసరసీరుహముల్ తదుదారసౌరభ
స్ఫురితగతాగతభ్రమణశోభితషట్పదలీలఁ దెల్పుచున్॥ 82

చం॥ మురిపెముతో సువాసినులు ముత్తెపుసేసప్రాలు పైఁడిప
ళ్ళెరములఁ దేర హస్తయుగళిన్ వడిముంచి శిరంబులన్ వధూ
వరులనునించి రొండొరులు వర్ణితకల్పలతాసురద్రుమా
గ్ర రయగళత్తదీయకళికానికరంబుల సొంపునింపుచున్॥ 83

క॥ వలరాజువిజయశంఖము। వలనుగఁబూజించు లీలవనరాశిసుతా
గళమున వణిరాజిత మం। గళసూత్రముఁగట్టె శౌరి ఘనహర్షమునన్॥ 84

సీ॥ దీనులయాపదల్ దీర్పఁగట్టినకంకణములు నా శుభకంకణములుగట్టి
తముఁగొల్చువారికిఁ దలఁపులన్నియుఁగొంగుముళ్లు నాఁదగు కొంగుముళ్లు నెసఁగి
కృపనాశ్రితాళికి నిడుతుత్వ్రిశమనాపథంబు నా లాజహోమంబొనర్చి
సప్తర్షులకు ముక్తిసోపానములు చూపురీతి సప్తపదానుభూతి నెఱపి॥
గీ॥ యుచితగతినిట్లు వైవాహికోత్సవములఁ। జతురహంబులు దంపతుల్ సలుపునంత
నమరవరులకు బహువిధాన్నాదికమిడి। వేడ్క నందతికి సుధాబ్ధి విందుచేసె॥ 85

తే॥ చెలఁగి దీనుల దానదీనులుగఁ జేసి। వలయు జీవనములొసంగి వార్ధియప్పు
"డాత్మవత్సర్వభూతాని" యనెడి పల్కు। తథ్యముగఁ జేసెనగణితోదారమహిమ। 86

తే॥ నెరయఁబళు వైతనందు జనించినట్టి। కామధేనువు ద్రుమానుగాగన్న కల్ప।
తరువు శిలయైపొడమిన చింతామణియును। దాతలఁటయబ్ధి దాతల దాతగాఁడె॥ 87

క॥ అనిపొగడునట్టియర్థుల। వనధికృతార్థులుగఁ జేసి వనజాలయకున్
ఘనమణిభూషణరథవా। హనదాసీదాసతతులనరణ మొసంగెన్ 88

సీ॥ అంబరమణిశోభితంబులై జిగిమించు నంబరమణిశోభితంబులగుచుఁ
దారావళిప్రదీప్తంబులై చెలువొందు తారావళిప్రదీప్తంబులగుచు
వరసువర్ణవితానభరములై పొగడొందు వరసువర్ణవితానభరములగుచు;
ఘనసారగంధయుక్తంబులై వాసించు ఘనసారగంధయుక్తంబులగుచు॥
గీ॥ (శివి)బాలప్రవాళలతావిరచిత। పేటికలశోభితద్రవ్యపేటికలును
నుచితగతి నరణం(బిచ్చె)నుచితసంవి। ధానముదలిర్ప నమృతనిధానమపుడు 89

చ॥ అసదృశలీలవిద్రుమలతాత్యధికోదవనప్రశస్తిచే
నెసఁగి విరాజమానసరసిప్రపదార్థసమృద్ధిచేత ను
ల్లసిలి సుగంధసారరుచులంబొగడొందు ఘనాంతవస్త్రముల్
వసువునకిచ్చెఁగొన్ని నయపద్ధతి (గొన్నిఁటి నిచ్చె ధా)తకున్॥ 90

క॥ సముచితగతినిటులవికా। సముఁజెందిగృహప్రవేశసంభ్రమపరులై
తమకించు దంపతులఁజిత్తములరదీవించి ప్రేమఁదనయకుననియెన్॥ 91

సీ॥ అనుకూలగతిమించఁ బ్రాణనాయకరత్న హృదయంగమగుణాప్తి నెసఁగవమ్మ
చతురాళివర్గంబు సమ్మదంబునఁ బొంగ సుమనోవికాసంబుఁజూపవమ్మ

సవనప్రతిష్ఠిత(సత్సంతతుల)సుధాసేచనదృష్టి బోషించవమ్మ
యాచకవితతు లుద్యత్ఫలప్రాప్తజీవనమనోరథులుగాఁ దనుపవమ్మ॥

గీ॥ తల్లిబిడ్డలఁగడుఁజల్లదనముదనర।మానసప్రియ మొనఁగూర్చిమనుపవమ్మ
మేలిమిగఁబుట్టినింటికి మెట్టినింటి।కతిభువనరూఢికీర్తిదేశమ్మకొమ్మ!॥ 92

కం॥ అనుచుఁదగబుద్ధులుగఱపి।నను భర్తకు మ్రొక్కు సూఁతు నవ్యప్రీతిన్
గనుఁగొనికౌఁగిటఁబొదవెను।గనుగొనలన్ సమ్మదాశ్రుకణములునిగుడన్॥ 93

తే॥ పోయిరమ్మనిపల్కెనా పువ్వుఁబోణి।యనుఁగుఁదల్లులచేతదీవనలు జెంది
సాధ్వులాశీర్వచనములసన్నుతింప।వరయుతంబుగన[రిగెనా సిరిముద]మున 94

మ॥ తరుణీశోభనగానచాతురికి నుద్యచ్చామరగ్రాహిణీ
కరకంజస్ఫుటరత్నకంకణఝుణత్కారంబు తాళానుబం
ధరుచుల్ చూపఁ గళావతీ[కలితకాంతా]కీర్తనల్ వేత్రిణీ
వరకంఠాస్ఫుటిమించ నెక్కెరి ఖగస్వామిన్ వధూవల్లభుల్॥ 95

వ॥ ఇవ్విధంబున రథారోహణంబుచేఁ దద్గృహబహిర్ద్వారంబు నిర్గమించునెడ

తే॥ చంద్రశాలాగ్రనిర్మలసరణిమించఁ।బద్మరాగారుణాంశుదీప్తంబులైన
చంద్రశాలాగ్రనిర్మలసరణిమించ।బద్మరాగారుణాంశుదీపములచాలు॥ 97

సీ॥ హర్మ్యాగ్రములఁజూడ నవశోభవతులకు జాలకావళిఁదావు చాలదయ్యెఁ
జిత్రవైఖరుల రాజిలుబాణవిద్యకు సౌరమార్గముపట్టు చాలదయ్యె
విపణివేదికల భావించువారాళికిఁ జారుదృక్కులదీప్తి చాలదయ్యె
గడఁగితోఁదోపుల నడచుబల్ దొరలకు శశికాంతపదమిమ్ము చాలదయ్యె॥

గీ॥ నట్టిసందడి ఖేచరులగుటదివిజు।లెట్టకేలకుఁగడ తేరి రేమిచెప్ప
నిందిరాకంధరాంగుల కొసఁగు పెండ్లి।సంభ్రమంబెన్నఁదర మెవ్వారికైన॥ 98

సీ॥ తనరాజమానదృష్టిని రాజమానమై యొసఁగువాఁడు వరంబు లొసఁగువాఁడు
తనసన్నిధానంబు జనసన్నిధానమై తనరువాఁడు పురారి నెనరువాఁడు
తనసారగుణములు ఘనసారగుణములై వలచువాఁ డఘములఁ దొలచువాఁడు
తనవరాఖ్యానంబు ధనవరాఖ్యానమై మెఱయువాఁడు శుభంబులగయువాఁడు

గీ॥ దివ్యమణిసానుశిఖరాగ్రదీవ్యమాన।విద్యుదనుబంధకంధరవిభవమమర
ఖగపతిస్కంధమునరమాకాంతతోడ।నర్థి వేంచేసెనాదినారాయణుండు। 99

ఉ॥ పాటలగంధులందముగ బంగరుకోలలు కేలఁబూని కో
లాటలు చిత్రవైఖరుల నాడి చతుర్విధవాద్యముల్ దిశో
ద్ఘాటనలీల బోరుకలఁగన్ ఘనశోభనవైభవంబుతో
హాటకచేలుఁ డాత్మభవనాంగణవాటికిఁ జేర బోరునన్॥ 100

క॥ ద్విజయానముడిగిలీల।న్ద్విజయానకరవము లెసఁగ నీరాజనముల్
గజయానలొసఁగ సిరిసిం।ధుజయానతకల్పవల్లితో నరుదేరన్॥ 101

వ॥ ఇట్లత్యంతవైభవంబున నభ్యంతర మందిరంబునకరిగి యిష్టదేవతా ప్రార్థనంబులు గావించుచు 102

మ॥ సతులర్థింపగృహప్రవేశవిధు లుత్సాహంబుతోడన్ యథో
చితభద్రంబులుగా నొనర్చి హరి లక్ష్మీయుక్తుఁడై హేమని
ర్మితచిత్రాంబరరత్నభూషణతతుల్ బృందారకశ్రేణి కం
చితమోదంబున నిచ్చె నాత్మనతులం జేరన్నిరూపించినన్॥ 103

క॥ శ్రీరాణింపగలక్ష్మీ।నారాయణపరిణయాభినవభవ్యకథా
పారాయణములఁ జొక్కుచు।సౌరులు నిజసదనమునకుఁ జనుటయు నంతన్ 104

తే॥ సిరులు దలుకొత్త నవ్వధూవరులు ప్రేమ।గోరగింపంగఁ బొత్తుల నారగించి
విమలమృగనాభిగంధోదకముల వార్చి।రుచిరకర్పూరతాంబూలరుచులఁ దనరి 105

సీ॥ భూరిజాతవినోదపారిజాతామోద పారిజాతవనాళి పరఁగుచోట
సూనభారవికాసమాన భావుకవాసమాన భోగులకేళి మలయుచోటఁ
గంజరాగవిహారపంజరావిత కీరపుంజరాగరసోక్తిఁ బొసఁగుచోటఁ
కైరవాయుధజీవసార వాక్యారావతారవాప్యుత్తము లింపరయుచోట॥

గీ॥ మెఱయుఁ గర్పూరమణిదీపసురభిధూప।కుసుమశయ్యాకలాపసంకుమదలేప
చిత్రితాత్మీయరూపవైచిత్రిసంద।సుందిరహిమించు కేళికామందిరమున। 106

చం॥ పగడపుఁగోళ్ళు కుందనపుఁబట్టెలు కళ్కులకేతి పెట్టి యం
చగరులపాన్పు ముత్తియఁపుజాలికురాళము కెంపుజీనువా
సొగసుల మేలుకట్టు కడుసొంపువహింపఁగ నింపుపెంపు సం
పగివిరితావిదోమతెర సంచముపై హరి నిండువేడుకన్॥ 107

క॥ వసియించుసంతసుచితా।వసరము భావించి ప్రేషవనితలు లలినా
బిసరుహనివాసలీలా।వసులతపడకింటికరుగ వలయునటంచున్॥ 108

వ॥ అభినవాలంకారవిభవంబుల నయ్యంబుజాలయఁ గైసేసి విలాసవతులు సముచిత చాతురినిట్లనిరి 109

సీ॥ "పద్మాక్షతేజోనిధపంకజాత గేహాళినవయాళిరాయంచబోద!
ప్రకటించి కపటనాటకసూత్రధారిచే నటనంబుగాంచు సూత్రంపుబొమ్మ!
జలదవర్ణుని యురస్స్థలపంజరమ్మునఁ గుల్కుముద్దులు చిల్కఁబల్కుచిల్క!
నంగజగురునిచింతాలవాలమున నుత్కలికలవాసించు కనకలతిక!॥

గీ॥ అంఘ్రిసేవకుఁ జేరిహస్తావలంబ। సంభ్రమముఁ గాంచియాశేషసౌఖ్యమంద
నంతరంగంబునలరించి ప్రాణవిభుని। గలయుతజీవ చ్చేఁబదవమ్మ కలికికొమ్మ" 110

తే॥ అనుచుఁ జేపట్టియనుఁగుఁదొయ్యలులు దివియ। నిగుడుముందరసిగ్గు చేమగుడనిగుడు
మానవతియిట్లుడోలాయమానలీల। నంగజునితూఁగుటుయ్యెలయనఁగఁదనరి॥ 111

సీ॥ తెలివలువపొదివితో ద్దేరఁదారావృత తరుణేందురేఖ చందముననడుచు
మణిమయస్తంభంబుమాటుగాఁ గుసుమాస్త్రికమ్మసూత్రపుబొమ్మకరణినిల్చుఁ
దెరములుంగునఁజేరి శరధరాంతరసమాహితతటిల్లతగీతి నెసఁగివసలు
సముఖంబునకుఁదార్ప సఖులదాపునఁ బద్మినీలోలకలహంస లీలఁబొల్చు॥

గీ॥ ధవునిహస్తాంబుజమునహస్తంబుఁ జొనుపఁ। గల్పశాఖాంతసములతాగరిమనపుర
భగ్నసీరీతిఁదనుఁగూర్పఁ బద్మగేహ। సాత్త్వికానందమువహించుసంభ్రమించు॥ 112

వ॥ తదనంతరంబ 113

కం॥ పనివడితొయ్యలులొక్కొక। పనినెపమున జరగునంతఁ బద్మాలయనో
య్యననంకపాళిలోన। య్యనఘుఁడనిర్వాచ్యతత్సుఖాంబుధిఁదేల్చెన్॥ 114

సీ॥ భూరిప్రభాకర పుష్టిగాంచినచోట కలుదజక్కవలంచుఁ దలఁపఁదగదె
మకరాభిరూప్యసంపదవహించినచోట స్మరనిధానములంచు నరయఁదగదె
శృంగారరసము జృంభితంబులుగాన నిమ్మపండ్లనుచు వర్ణింపఁదగదె
యలపయోధరముల ఖ్యాతిసొందినచోటఁ బూర్ణకుంభములంచుఁ బొగడఁదగదె

గీ॥ యనుచునులిసేయు నెపమున వనితకుచము లంటితివురుచుఁ గైటకొంగమరఁగూర్చు
హారములుగోరఁదీర్చు నెయ్యంబుదార్చు సరసచాతురిఁగందర్పజనకుఁడపుడు

శా॥ చింతాప్రగ్రహముక్త సుదర్శనగతిన్ ఛేదించెవేపద్మినీ
కాంతోచ్చైస్స్తన కుంభముల్ దడవి యుత్కంఠందదుజృంభిత

స్వాంతంబొప్పఁ దనూత్సవానుభవ దీక్షుం జొక్కఁగాఁ జేసె నే
కాంతర్బాహ్యరుచిం గజేంద్రవరదుం డానందసంధాయియై॥ 116.

తే॥ ఇనకరస్పర్శమై నన్ను కొనహిమాభ గుంఠనముబాళియుప్పొంగెఁ గొమ్మకుచము
లినకరస్పర్శమై నన్ను కొనహిమాభ గుంఠనముబాళియుప్పొంగెఁ గోకరుచులు॥

మ॥ సమరీతిన్ సముఖోత్తమాశ్రయ విలక్ష్యంబైన నేత్రప్రసా
రము లోజం బదపాళిఁ జేర సగుణవ్రాతంబుచేఁ దాను నే
త్రమనన్ మించుట మధ్యమాశ్రయ మయుక్తంబంచు వర్జించెనాఁ
దమిప్రీడాసతి నీవి వీడసడలెం దచ్చేల మిచ్ఛారతిన్॥ 118

చ॥ తడవిన నూరకుండెడివిధం బనుకూలతఁ దెల్ప నీవిదా
సడలుట క్రీడనన్ సెలవొసంగుటగా రసికాగ్రగణ్యుఁడై
కడఁక మెయిన్ సటారబిగి కౌఁగిటఁ జేర్చి వినూత్నసంగతిన్
గడుఁ దనియించెఁ బంచశరుఁ గాంచినజాణ కళాప్రవీణతన్॥ 119.

క॥ ఈలీల శౌరి నూతన కేళిం దేలించి కోరకితరతిపద్యన్
లాలించి క్రమక్రమమున బాలామణి యగునవోఢఁ బ్రౌఢం జేసెన్॥ 120.

మ॥ అనుభావ్యశ్రుతికూజితం బమితవాగాసక్త మామోహమో
హన మాసూత్రితనఖాగ్ర మాహతధృతివ్యాహార మంచత్ప్రబం
ధనిరూఢం బతి తారకావలనహృద్యం బద్భుతవ్యాపివ
ర్ణనమై యొప్పె రతోత్సవం బపుడు వీణావాదనప్రక్రియన్॥ 121.

సీ॥ ద్వంద్వవాసనల నిత్యప్రీతఁ జేసి యద్వంద్వవాసన నిరర్థక మొనర్చె
రుచిరాధరామృత రుచులచే నొక్కించి యమృతానుభవ మవాచ్యమనిపించెఁ
గళలరేఁ బగలెఱుంగక యుండఁగలసి రేఁబగటిచూపులఁ జిరప్రతిభ నించెఁ
గల్పితమృదులాంక తల్పసౌఖ్యముగూర్చి ఫణితల్పమువిలక్ష్య పదముఁ జేసె

గీ॥ విశ్వమయమూర్తియగు నాదివిష్ణువునకు సారసరసాతిమాధురి చాక సేయు
సారసరసాతిమాధురి సంఘటించె (సర్వశక్తులకేవి యసాధ్యమగును)॥ 122

క॥ భావజనీరహమోత్సవ భావజనీరాతిరేక భరమున నిటులన్
దావియుఁ దామరయుం బలె దేవియు దేవరయుఁ గలసి దినదినరుచులన్॥ 123

సీ॥ అంభోజసంభవాం డాయతస్థలమున నవ్యమాయావ గుంఠనముఁబన్ని
సంచితాజ్ఞానక జలధూమరుచిఁబోల్చి విజ్ఞానదీపికా వితతిఁగూర్చి
స్ఫుటశుభాశుభకర్మ సూత్రసంవళిత జీవులవిచిత్ర ప్రతిమలనొనర్చి
నానాగమప్రవీణ పురాణతతినైజ కీర్తికథా ప్రసంగికులఁజేసి
గీ॥ ప్రకృతిపురుషస్వరూప విభ్రాజితప్ర పంచమునబొమ్మలాట లాడించుకొనుచుఁ
ప్రౌఢిఁగ్రీడించె రాజదంపతులువేడ్క ననుపమానయథేచ్ఛా విహారములను॥ 124.
క॥ శ్రీలక్ష్మీ నారాయణ లీలావైవాహికా కలితకథధరణీ
పాలమణి కిటులమునియు ద్వేలగతి సవిస్తరముగఁ దెల్పుచుఁబల్కెన్ ॥ 125.
సీ॥ విద్యానవోద్యాన పద్యానటస్ఫూర్తి మందారకుందారవిందకీర్తి
శ్రీకారరాకార తాకారసుషమాస్య శుద్ధాంతసిద్ధాంత శుకవయస్య
ప్రాలంబనాలంబ రోలంబకులవేణి వీణాంకశోణాంక విమలపాణి
ధీనాయసూనాయ మానాయగుణపాత్ర కంజాతసంజాత ఘనకళత్ర
గీ॥ భారతీదేవిచాతుర్య భారతీష్ట సరస[illegible]నీరమావిలాస రసకావ్య
రచనభావింప మధురవాగ్రచనవచన మహిమనిష్ఠలఁజేయు ధీమహిమవెలయ 126.
వ॥ అని మఱియును, 127.
సీ॥ రాజీవరాజీవ రాజీవతేజంబు మారోపమారోప మంజులేఖ
సంతానసంతాన సంతానభాగ్యంబు బలహారిబలహారి పటువిభవము
వామాంగవామాంగ వామాంగసంపద తారాళితారాళి గౌరుకీర్తి
కాండప్రకాండప్ర కాండప్రభుగుణాప్తి శృంగారశృంగార ధృత (నిరుక్తి)
గీ॥ శ్రీవిలాసినియొసఁగు లక్ష్మీవిలాసఁజతురగతిఁబఠియించెడి చతురులకును
శుభకళావృత్తితోఁబురా శుభకలాప తారకాయతినాచంద్ర తారకముగ॥ 128.

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణ కరుణాకటాక్ష సంప్రాప్త
సారస్వత వైభవాక్కయామాత్య తనూభవ
రసికజనహృదయంగమ సంగీతసాహిత్య
ధౌరంధర్య రాయసము వెంకట
మంత్రివర్య ప్రణీతంబైన
లక్ష్మీవిలాసంబునందుఁ
బంచమాశ్వాసము
సంపూర్ణము.

# శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 6 | ్రగహా | గ్రాహ |
| 2 | 9 | మతి | నుతి |
| | 25 | విలసిల్లు | విలసిల్లి |
| 4 | 24 | మఁదారుఁడ్రై | మందారుఁడ్రై |
| 5 | 19 | హాసమమరస | హాసమమర |
| | 17 | సమూకృత | సమీకృత |
| | 21 | స్వామిఁదలతు | స్వామిఁదలఁతు |
| 7 | 12 | విహారునకు | విహారునకును |
| | 13 | ప్రణాంబు | ప్రణామంబు |
| | 19 | శరణ్వా | శరణ్యా |
| | 22 | విభద | విభేద |
| 19 | 13 | యుక్తి | యుక్త |
| 10 | 1 | నిర్జరేంద్ర | నిర్జరేంద్రు |
| | 3 | కుముమాంబురుహా | కుముదాంబురుహ |
| | 8 | మందయాద్రి | మందరాద్రి |
| | 9 | మంగకళార | మంగళాకర |
| | 19 | పొలదుగ | పొందుగ |
| | 25 | జగమల్ | జగముల్ |
| 11 | 1 | మూర్ఛ | మూర్ఛఁ |
| | 11 | యచ్చుతుండట | యచ్యుతుండఁట |
| | 18 | నమ్ముహా | నమ్మహా |
| | | గొనం | గొనెడి |
| 12 | 1 | నురపతి | సురపతి |
| | 5 | ప్వతోద్దారణం | పర్వతోద్ధారణం |
| 14 | 1 | నెవ్యని | నెవ్వని |

| | | | |
|---|---|---|---|
| 15 | 1 | నిపుణుఁడు | నిపుణుండు |
| | 5 | చందనము | చందము |
| 16 | 4 | బ్రహ్మాండ | బ్రహ్మాండ |
| | 11 | దోఁడు | దోఁచు |
| | 25 | గకవికవై | గకవికలై |
| | | కృతాంతులు | కృతాంతుల్ |
| 17 | 2 | శిఖ | శిఖి |
| | 7 | ఫ్రూటా | ఫుట్టా |
| | | ఘుర్భర | దుర్భర |
| | 14 | రగలును | రగులును |
| | | క్రోసింప | క్రోశింప |
| | 22 | నయ్యుదుటనం | నయ్యుదుటున |
| 20 | 19 | గల్పట్టె | గన్పట్టె |
| | | సాయిం | సాయం |
| | 13 | పతత్ఖయోావృతి | పతత్పయోావృతి |
| | 18 | రత్నాభీ | రత్నాభి |
| 24 | 5 | నేమ్మోవి | నెమ్మోవి |
| | 15 | లోలులై | లోలురై |
| 27 | 10 | సొలయించు | సొలయించు |
| | 26 | వనువు | వసువు |
| 28 | 4 | పంద క్తిని | పం క్తిని |
| 29 | 6 | డ్యాంతకు | ర్యాంతకు |
| 30 | 12 | మహా | మహో |
| | 18 | జమో | జనూ |
| 32 | 13 | గవల్చె | వగల్చె |
| | 16 | గొనచుఁ | గొనుచుఁ |
| 33 | 4 | బలముకు | బలమునకు |

| | | | |
|---|---|---|---|
| 35 | 22 | క్శళ | కళా |
| 36 | 13 | శుధా | సుధా |
| 41 | 7 | దండె | డండె |
| | 9 | వేయఁ | వేయఁగఁ |
| 42 | 1 | స్థతి | స్థితి |
| | 6 | మనంగా | మనంగ |
| 43 | 5 | ై రవగంధి | కైరవగంధి |
| | 9 | లవితాంఘ్రిచ్ఛవి | లలితాంఘ్రిచ్ఛవి |
| | 24 | జారంబోయి | జేరంబోయి |
| 44 | 8 | చల్వు | చెల్వు |
| | 17 | హరిహయుఁదాది | హరిహయుఁడాది |
| | 20 | జూచి | జూఁచి |
| 48 | 18 | నుద్యానన | నుద్యాన |
| 50 | 1 | మింళద | మిళింద |
| | 5 | నెమ్మ్మిగ | నెమ్మొగ |
| | 23 | సమదేందిందర | సమదేందిందిర |
| | 25 | జంతఁ | జెంతఁ |
| 51 | 22 | శారికా | శారికా |
| 52 | 4 | వియద్ఘునాభు | వియద్ఘనాభు |
| | 12 | దడియ | దడయ |
| | | జలికేఁ | జవికేఁ |
| 54 | 17 | దలిరులాఁదు | దలిరులొందు |
| 56 | 14 | కక | కచ |
| 58 | 19 | పతిగ | పతగ |
| | 20 | రత్నాకరుండేదు రేగి | రత్నాకరుండెము రేగి |
| 59 | 4 | జారిణి | జారిణీ |
| 61 | 18 | పవనోచ్ఛలితాచ్ఛాదన | పవనోచ్ఛలితాచ్ఛాదన |

| | | | |
|---|---|---|---|
| 64 | 3 | హానోద్వృత్తిం | హననోద్వృత్తిం |
| 66 | 1 | శితఋతు | ఋతు |
| | 19 | నూర్యా | సూర్యా |
| 66 | 21 | నిష్టం | నిష్ఠం |
| | 24 | కేళి | క్ష్వేళి |
| | 26 | గ్రామణి | గ్రామణీ |
| 67 | 4 | వారిజాతాగ్రణి | వారిజాతాగ్రణీ |
| | 9 | దం | దర |
| | 26 | గరమె | దరమే |
| 69 | 3 | నూర | సూర్య |
| 70 | 3 | త్యాజ్య | త్యాజ్య |
| | 7 | మర్ధన | మర్దన |
| | 15 | ముసలచ్పట | ముసలచ్ఛట |
| | 17 | అదికార | అధికార |
| | 20 | విలనన | విలసన |
| 71 | 16 | బె | బై |
| | 23 | నముచ | నముచి |
| 77 | 26 | కలము | కలఘు |
| 80 | 11 | హరిహాణంబుల | హరివాణంబుల |

# అభినవసరస్వతి.

ఇది విశేషించి తెలుఁగు కావ్యములును యత్కించిత్సంస్కృత విషయములును బ్రచురించుచుండుట కభినవముగ నేర్పడిన యొక మాసపత్రిక. ఇందు నేతత్పూర్వోక్త విషయములే కాక విశ్వబ్రాహ్మణులమని బయలుదేరిన కంసాలుల పూర్వపక్షాంశములు గూడఁ బ్రకృత మొక్కింత ప్రచురింపఁబడుచుండును. చందాదారులకు సంవత్సరము మొత్తముమీఁద 4-5 మంచి యపూర్వగ్రంథము లలవడును. కావున నిది యగ్రవర్ణాభిమానులకు నాంధ్రభాషాభిమానులకు నవశ్యమాదరణీయము. చం. నా. సంవత్సరమునకు రు [illegible] 0 0.

### ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఆశ్వమాచార్య విజయము. ... ... ... | 0 | 4 | 0 |
| 2. | కరణికోద్ధారిణి. (పూర్వ పీఠిక ప్రకటి) ... ... | 0 | 4 | 0 |
| 3. | వాసంతికా పరిణయము } ఇవి 2 నాటకములు. ... | 0 | 4 | 0 |
| 4. | కంసవధము } ... | 0 | 8 | 0 |
| 5. | మహాత్మ్యమంజరి. (సింహాద్రి వెంకటాచార్యులు) ... | 0 | 4 | 6 |
| 6. | గురుపరంపర. ... ... ... ... | 0 | 2 | 0 |
| 7. | నీతిగీతులు. (సుమతిశతకమునకు సంస్కృతము.) ... | 0 | 2 | 0 |
| 8. | వన్నెల నీతిశతకము. (కొండముది నరసింహము.) ... | 0 | 1 | 6 |
| 9. | విశ్వబ్రాహ్మణ శబ్దఖండనము. ... ... ... | 0 | 1 | 6 |
| 10. | అత్యద్భుత విమర్శనము. (పం॥ కృష్ణద్వైపాయనాచార్యులు. ఇది వెంకటరామకృష్ణ కవుల యవధానములపై విమర్శనము.) | 0 | 5 | 0 |
| 11. | నర్సరావుపేట శతావధానము (తిరుపతి వెంకటీయము) ... | 0 | 3 | 0 |
| 12. | లక్ష్మీవిలాసము (రాయసము వెంకటపతి) ... | 0 | 4 | 0 |
| 13. | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము (పత్రికాధిపతి) ... | 0 | 4 | 0 |

### అచ్చుపడుచున్న పుస్తకము.

పల్నాటి వీరభాగవతము

వలయువారలు సొమ్ముపంపిగాని వి. పి. ద్వారాగాని ఈక్రింది వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.



జానపాటి పురుషోత్తం.
సబ్ యెడిటర్. జానపా[illegible].
పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా,